# ధర్మ చక్రం

శ్రీ: నండూరి రామకృష్ణమాచార్య, ఎం. ఏ.



త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము

రు. 2—0—0

## ముఖ్యపాత్రలు



| | | |
|---|---|---|
| చంద్రగుప్తుడు | : | మగధసామ్రాజ్య చక్రవర్తి |
| చాణక్యుడు | : | మగధసామ్రాజ్య ప్రధానామాత్యుడు |
| బిందుసారుడు | : | యువరాజు |
| మహాసేనుడు | : | వృద్ధసేనాధిపతి |
| బౌద్ధసన్యాసి | : | బౌద్ధమత ప్రచారకుడు |
| మేఘనాథుడు | : | సేనాపతి |
| నీలకేతనుడు | : | మహాసేనుని ధ్వజారోహకుడు |
| గండోదరుడు | : | బిందుసారుని మిత్రుడు |
| దండుకేశ్వరుడు | : | గండోదరుని మిత్రుడు |
| వజ్రబాహు<br>వీరదాసరి | } | తలారులు |
| ఉషాసుందరి | : | బిందుసారుని ప్రణయిని |
| నందిని | : | మహాసేనుని కూతురు |

వందిమాగధులు, సేవకులు ఇత్యాదులు

# పరిచయం



తనతండ్రి చంద్రగుప్తమౌర్యుడు స్థాపించిన సామ్రాజ్యాన్ని భక్తి శ్రద్ధలతో పాలించి విస్తరింపచేసి, తన పుత్రుడైన అశోకచక్రవర్తికి వప్పగించిన ధన్యజీవి బిందుసారుడు. యువరాజుగా నున్నపుడు భోగలాలసుడై సామ్రాజ్యగౌరవానికే భంగం కలిగించెనన్న అపవాదు కొన్ని ప్రాచీన గాథలలో ఇతనిపట్ల కల్పింపబడినది. చంద్రగుప్త చాణక్యులు యువరాజును సన్మార్గమునకు త్రిప్పి, పట్టాభిషిక్తుని గావించి, తాము ఆశ్రమవాసులైనట్లు ప్రతీతి. బిందుసార- ఉషాసుందరుల ప్రేమగాథను మహోజ్వల స్వప్నంగా మిత్రులు శ్రీ రామకృష్ణమాచార్యులుగారు చిత్రించారు. దండనీతికే ప్రాధాన్యమిచ్చిన చంద్రగుప్త చాణక్యులకూ, ధర్మదీప్తికే తమ జీవితాలను నారపోసిన అశోక ఉపగుప్తులకూ మధ్యకాలంలో సామ్రాజ్యనౌకను నడిపిన బిందుసారునిలో, ఉభయ యుగ ధర్మాలూ సమన్వయం పొందినవి. ఉషాసుందరిని మనసారా ప్రేమించినంత మాత్రాన యువరాజు ధర్మచ్యుతిని పొందలేదు. అతని ప్రేమ అతి పవిత్రమై రసజగత్తులో లీనమైనది. ఉషాసుందరి మహారాజ్ఞి కాలేకపోయినా, సర్వసేనాపతియైన బిందుసారునికి విజయఖడ్గమందించిన వీరనారి. తాను బౌద్ధధర్మానుకూలనంవి, బిందుసారుని "ధర్మపత్నీ సమేతంగా రాజ్యచక్రాన్ని శాసిస్తూ ధర్మచక్రాన్ని శిరసావహింపు"మని ప్రబోధంచేసిన ధర్మసోదరి. అటు రాచరికమూ, ఇటు ధర్మనిరతీ బిందుసారునిలో మూర్తీభవించుటకు ఉషాసుందరీ సాహచర్యమే కారణమైనదని శ్రీ ఆచార్యులవారి రచన స్ఫురింపచేస్తున్నది. కథాసంవిధానం, పాత్రపోషణ, ఉత్తమపథంలో ఉన్నవనుటకు ఇదే చాలు.

షేక్స్పియర్ రచించిన చారిత్రక నాటకాలలో 'ఐదవ హెన్రీ' ప్రసిద్ధికెక్కినది. హెన్రీ యువరాజు ఫాల్‌స్టాఫ్‌వంటి స్నేహితులను చేపట్టి, తన హోదాకు తగనిరీతిగా ప్రవర్తించి, చివరకు తాను ప్రభువైనప్పుడు పూర్వపు స్నేహబంధాలనుండి విముక్తుడైనాడు. దండుకేశ్వర గండోదరుల పాత్రలు కొంతవరకు ఫాల్‌స్టాఫ్ పాత్రను పోలియున్నవి.

ఇటీవల ఆంధ్ర సారస్వతంలో ఉత్తమస్థాన మాక్రమించిన నాటకాలలో, శ్రీ విశ్వనాథవారి 'అనార్కాలి' ఒకటి. యువరాజు సలీమ్ శానిసబాలికయైన అనార్కాలిని ప్రేమించి, ఆమెను భావిభారత చక్రవర్తినినిగా గౌరవింపనెంచిన ఇతివృత్తమే, అందు చిత్రింపబడినది. అక్బరు- మానసింహులు చంద్రగుప్త- చాణక్యులవలెనే, యువరాజును అనార్కలినుండి వేరుపరచి, సామ్రాజ్య ప్రతిష్ఠను కాపాడ సంకల్పించిరి. బిందుసార- ఉషాసుందరుల ప్రేమగాథ, సలీమ్- అనార్కాలీల ప్రేమగాథవలె కేవలం విషాదాంతంకాక, ధర్మసామ్రాజ్యానికి దారితీసినది.

పది సంవత్సరాలనాడు శ్రీ వేలూరి చంద్రశేఖరంగారు రచించిన 'కాంచనమాల' అనే ఉత్తమ నాటిక మా 'కృష్ణాపత్రిక'లో ప్రకటితమైనది. తిష్యరక్షిత, కాంచనమాల, కుణాలుడు అందు ప్రధానపాత్రలు. ఆనాటి భారతీయ సాంఘిక రాజకీయాలను ప్రతిభతో చిత్రించి, శైలిలో నేమి ఉదాత్తభావ ప్రచురణలో నేమి, శ్రీ చంద్రశేఖరంగారు ప్రథమశ్రేణి సాహితీపరులని పేరు గడించుకున్నారు. ఈ నాటికి మరల 'కృష్ణాపత్రిక'లో 'ధర్మచక్రం' వంటి ఉత్తమ నాటిక వెలువడినందుకు నేనెంతో సంతసించాను. అది ప్రకటితమైన రోజులలో నేను పత్రికాసంపాదకత్వం వహించిన సన్నివేశం ఎన్నడూ మరచిపోలేను. ఆంధ్రదేశంలో ఉత్తమనటులున్నారు కాని, ఉత్తమ నాటకాలు అంతగా లేవని నిరుత్సాహపడిన నావంటి వారికి 'ధర్మచక్రం' ఆశాజనకంగా

ఉన్నది. కవి, పండితుడు, రసజ్ఞుడు, విమర్శకుడు అయిన శ్రీ రామ కృష్ణమాచార్యులవారు తమ కృతులవల్ల ఆంధ్ర సాహితీప్రపంచంలో వన్నె కెక్కినారు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల శకం గడిచినది. వారి శిష్యులైన శ్రీ విశ్వనాథ, పింగళి, కాటూరి కవుల శకం గడుస్తున్నది. శ్రీ లక్ష్మీకాంతంగారి ప్రియశిష్యులైన శ్రీ ఆచార్యులవారిది మూడోతరం అనుకోవచ్చును. ఆంధ్ర సాహిత్య స్రవంతి అవిచ్ఛిన్నంగా, నిర్మలంగా ప్రవహిస్తుందనీ, తోటి భారతీయ సాహిత్యాలలో గౌరవం పొందుతుందనీ, నా విశ్వాసం. శ్రీ రామ కృష్ణమాచార్యులవారూ, వారితరం సాహితీపరులూ రచించే కృతులను ఆస్వాదించినప్పుడు, నా విశ్వాసం దృఢమవుతున్నది.

కావ్య గౌరవం పొందిన ఈ 'ధర్మచక్రం' ప్రదర్శన యోగ్యమై ఆంధ్ర ప్రపంచాన్ని అలరించుగాక! నాటక కర్తకు నా ప్రేమాశీస్సులు.

'త్రివేణి' బందరు
1-9-50

కోలవెన్ను రామకోటీశ్వరరావు



# ఆమోద ప్రసరణము

---

బుద్ధుని మృగదావమునందలి ప్రథమధర్మప్రబోధమునకు సూచకముగ బౌద్ధవాస్తువునందు చక్రము చిహ్నింపబడెననియు, కాలక్రమమున నదియే ధర్మచక్రమని పిలువబడుచున్నదనియు అభిజ్ఞులు చెప్పుదురు. ధర్మమునకు ఈ చక్రరూపమును బౌద్ధశిల్పులు భారతీయ పౌరాణికవీథినుండియే తెచ్చుకొనిరి. మన పురాణములలో ధర్మము అదృష్టము కాలము సంసారము యజ్ఞము మొదలైనవి చక్రపదోత్తరముగ నుచ్చరింపబడుట వేత్తల కసాధారణవిషయముగాదు. నైమిశ శబ్దనిర్వచన సందర్భమున— ఆదిని బ్రహ్మదేవుడు మనోమయమగు నొక చక్రమును నిర్మించి సత్యలోకమునుండి ఊనిక యిచ్చి విడువగ అది ఒడుగుడుకులదారి దొర్లివచ్చి హిమాలయ ప్రాంతముల 'శీర్ణ నేమి' యైనదనియు, దాన నన్నెలవు నైమిశంబయ్యెననియు చెప్పబడు కాశీఖండ పురావృత్తము ఇట అనుసంధేయము. ఆ మనోమయ చక్రము ధర్మచక్రము. మిగిలిన వానికిని లక్ష్యము లనేకములు కలవు. ఇది విషయాంతర విపులీకృతియగును. భారతీయుల ఈ యభిప్రాయమే బౌద్ధ శిల్పుల ద్వారా లోకమున వ్యాపించినది. వైదికమగు 'అహింసా పరమోధర్మ' బౌద్ధముగ చెలామణీలోనికి వచ్చినట్లు భారతీయులగు ఇట్టి కల్పనల నెన్నిటినో బౌద్ధముగ స్వీకరించుచు వచ్చినది. ఇట్టివానిలో ధర్మచక్రము ఒకటి. ఇట్టి యీ ధర్మచక్రమును తొలుత భగవంతుడగు బుద్ధుని బోధకే గురుతుగా స్వీకరించినను పిదప బౌద్ధధర్మబోధకే వాడబడినది. అట్టి యొక బౌద్ధయోగి ధర్మచక్ర పరివర్తన కథను ఉపజీవించునదగుట ఈ రూపకము ధర్మచక్రము.

ధర్మచక్రము చారిత్రక రూపకము. ఆధునికాంధ్రవాఙ్మయము పైననేగాక, ఆంధ్రవాఙ్మయసమష్టిపై హిందీసారస్వత ప్రియులు వేయు నింద ఒకటి గలదు. అది చరిత్రాత్మక సాహిత్య మాంధ్రమున పూజ్యమని. ఇది సహింపగాని నిందయే. దానికి నాడు ప్రసక్తి లేదనుట సామాన్యమగు ప్రత్యుత్తరము. పోతన భాగవతము వరకు మత ధోరణియే వాఙ్మయమున సూత్రము వహించినది. పిదప నాటినుండి నేటివరకు కేవల రసికసాహిత్యమే పోయలు పోవుచున్నది. నాటి మాట యెట్లున్నను నేడు మాత్రము వీరారాధన ప్రవణమైన చరిత్రాత్మక సాహిత్యము ఎంతయేని దేశభాషలన్నిట ముఖ్యమగుచున్నది. ప్రజానాయకులు వహించు ఒక్కగొడుగునీడ భారతవర్షము అలపు దీర్చుకొను ఈరోజులలో ఈ విషయమున తీవ్రకృషి జరుగ

వలసియున్నది. రచన కేవలము చేతిపనిగాదు. ప్రధానముగ మానసికమే యని చెప్పదగినది. అట్టిచో చారిత్రకములగు రచనల విషయమున చిక్కులు రెండు రకములు. ఒకటి చక్కని చరిత్రజ్ఞానము వలయును. రెండవది ఆచరిత్రయం దంతర్భూతములగు రసగ్రంథుల నెన్నికోగల సహృదయత. ఆపై ఆకథను రచన బద్ధము చేయగల దక్షత. ఇన్ని యున్నగాని రక్తి గట్టించుట కష్టము. చిలకమర్తివారి హేమలతతో వేదమువారి ప్రతాపరుద్రీయముతో రెండు పాయలుగవచ్చిన యీ వాఙ్మయము కొంత లేకపోలేదు. కాని అది చాలదు. ఇట్టి అభ్యుదయ పథమున కృషిచేయుచు ఉజ్వల భవిష్యత్తును సూచించు రచయితలు ఆచార్యులవారు. వారికి చరిత్ర అభిమాన విషయము. అక్షరవీధి అసివారుగా నేగునట్టి బయలు. ఆధునికాంధ్ర వాఙ్మయ సమష్టికి ఆడియాలమగు లలితరీతి వారి కావ్యరీతి.

ధర్మచక్రము వస్తుగుణమున చరిత్రకేగాక బౌద్ధమునకును సంబంధించిన రూపకము. ఈ సారస్వతమున కింకవీంద్రఘటాపంచాననుల బుద్ధచరిత్రమే మహామాత్రమున వ్రాయబడినదో నాటినుండి శిష్యపరంపర సంయుతము బౌద్ధగాథల నధికరించి రమణీయముగ చిత్రించుట జరుగుచున్నది. చెళ్లపిళ్లవారి శిష్యులు శ్రీ పింగళి కాటూరి కవుల సౌందరనందము—శిష్యప్రదేయ రసాధాయక వాక్ప్రసిద్ధులు వాఙ్మయతపస్సంపన్నులనగు గురుశ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి శిష్యులగు ఆచార్యులవారి ధర్మచక్రమును పైవిషయమును స్థాపించునవి. ఇంతేగాక అక్షరాస్యుల కలవర బెట్టిన కరుణశ్రీ బౌద్ధగాథా ప్రపంచనము అనుభవపునరుక్తము. ఇట్టిరూపకము ఆధునికయుగమునందలి యొక ప్రముఖ లక్షణముచే విశిష్టము.

ఇందలిగాథ చంద్రగుప్త చాణక్య బిందుసారుల ప్రసిద్ధజీవితము లుపఘ్నములుగ కొనలుసాగి తనర్చి తలిర్చిన నవమాలికాలత. హింసాక్షుభితమై సంగ్రామ జర్జరితమగు లోకమున శాంతి నెలకొల్పగలిగినది బౌద్ధమగు ధర్మచక్ర పరివర్తనమే యనుట రూపకకర్త సందేశము. ఇది 1946 నాటికే మిత్రశ్రీ రామకృష్ణమాచార్యులవారికి స్ఫురించినది.

చెన్నరాష్ట్రమునకు విచ్చేసిన గాంధీమహాత్మునకు 1946, జనవరి 21 తేదీన ఆంధ్రపత్రికా ముఖమున అర్ఘ్యాంజలి నర్పించుచు వీరు రచించిన

“ రాట్నము ధర్మచక్రముచేసి, ”

“పరిశుద్ధ ఖద్దరు నిర్మించు కర్మయోగి” అను కావ్యైకదేశము, ఈ రూపకమును సమకాలికములు. ఆదేభాగము 1947 నాటికే జాతీయనాయకులు పతాకాంకముగ ప్రకటించుట అనిదంపూర్వమగు సంఘటన. ఆచార్యుల

వారి కల ఇట్లు కలరూపు ధరించుటలో హేతుహేతుమత్ భావము లేక పోయినను, ఈ విషయము తెలిసినవారికిమాత్ర మాశ్చర్య జనకము.

ధర్మచక్రమునందలి కథ సంక్షేపముగా నిది—చంద్రగుప్తునకు అవిచ్ఛిన్న శారీరక ప్రణయనిదాఘతప్తుడు విషయలోలుడగు బిందుసారు డను పుత్రుడు గలడు. అతడు సములుకానివారి మైత్రిలో గర్వింపబడుస్థితిలో గడిదేశముల దాటివచ్చు గ్రీకుల నెదిరి పోరాడవలసివచ్చెను. అతనికి ఒక వారవిలాసిని బూజుగురాలు. ఆరంభమున ఆతని పతనహేతువుగ గర్వింపబడనీయక చివరకు పరివ్రాజకయై అతనికి బౌద్ధప్రబోధమిచ్చెను. ఈ ప్రధానకథకు ఉపకథగా నందినీ మేఘవాహనుల ప్రణయగాథ నడచును. విప్రతిపన్న విధచే మనోహతయైన నందినియు, ఉపవలెనే బౌద్ధధర్మావలంబిని యగును.

రూపక వాఙ్మయమునందు దీనికి అచంచలమగు స్థానము నిర్వింపగలిగినవిగా స్పృశింపదగిన లక్షణములు మూడు. ఒకటి—ఇందలి వాతావరణ కల్పన. రెండు—సుకుమార హాస్యము. మూడు—సంభాషణ చమత్కారము.

ఇందు రూపకము ఆరంభమైనది మొదలు చివరివరకూ రెండు వేల మూడు వందల సంవత్సరములనాటి భారతవర్షమే ఊహలకు తెరగొత్తును. పేరునకు చారిత్రకము. కాని అంతయు కల్పనయే. ఐనను పేరులుంచుట నుండి, సంభాషణలు నడపుటనుండి, సామాన్యజీవిత చిత్రణమువరకూ అంతయు నాటిదే. తామ్రపర్ణి వర్తకము నాటి వజ్రములు పగడములు సింహళయాత్ర కాలమానము ఒకటేమి సశరీరముగ నాటి పాటలీపుత్రమున తిరుగుచున్నటుల భావించుకొందుము. ఒక వంక ధర్మస్థాపనచణమైన చాణక్యుని మహామాత్య దుర్నిరీక్ష్యకాంతి; రెండవదెస యౌవనావధుల నుపజీవించు యువరాజు విషయారామత; వీటి రెంటిని బోగాదను బౌద్ధసన్యాసి ప్రవేశ నిర్గమన కాంతిరేఖలు కథయందెక్కడి కక్కడే 'ఆరు ఋతువుల నందనం బగునెడంద' అనిపించును. ఇది నేటి నాటకములలో కన్యాశుల్కము, నర్తనశాల, నదీసుందరి తప్పించి మిగిలిన వానిలో దుర్లభము. కన్యాశుల్కమున అనుక్షణము తెనుగునాటి అగ్రహారములే తగులుచుండును. నర్తనశాలలో వర్షర్తుభయానక దృశ్యము, అదృశ్యగంధర్వ సంచారము, అద్భుత సృష్టులు. రచయితకు సంబంధించిన రవీంద్రుని శాంతినికేతనానుభవము అక్షరబద్ధమైనదనిపించు నదీసుందరిలోని ప్రశాంత కవేరాశ్రమసంఘటన నిరుపమానము. భారత బౌద్ధధర్మముల శబలితమైన చంద్రగుప్తునినాటి సాంఘిక వాతావరణమునకు ఈ గ్రంథము మెరుగుమాయని అద్దాలమేడ.

కన్యాశుల్కము తరువాత రూపకపరంపరలో ప్రహసన మనిపించుకొనకుండ పేర్కొనదగిన హాస్యరచనలు పానుగంటి చిలకమర్తి ప్రముఖుల వనవచ్చును. రూపకమందలి పానుగంటివారి హాస్యము అగ్రహారికుల వైదిక హాస్యము. ఇక ఈ గ్రంథమునందో హాస్యము ఎక్కడికక్కడె వినీతతరమై వెల్లివిరియును. మిగిలిన రసములను కమ్మి హాస్యమే రాజ్యమేలుచున్నదా యనిపించును. శకారుని హాస్యచ్ఛాయలు కొంత లేకపోలేదు. 'నేను ద్రౌపది మీసాలపై చిన్ని పుట్టుమచ్చనై' ఇత్యాది. ఇచ్చట నే దండుకేశ్వరుని మాటలందు విప్రనారాయణుని శిష్యుడు శ్రీనివాసుడు నీడగట్టును. పై సందర్భములు ఇచ్చట కేవలము త్రాగుబోతులమాటలు. మూలములని పేర్కొనదగిన గ్రంథములందో అది పెద్దమనుష్యుల మాశకొనవారి హాస్యము. ధర్మస్థానఘట్టమునందలి సంభాషణలు ఇందలి సుకుమార హాస్యమునకు ఆకరములు. అచ్చటి మహాసేన గండోదర సంభాషణ మన సారస్వతములోని ఉత్తమ హాస్యరచనలకోవకు చెందినది. యువరాజు శీలపరివర్తనమును పరామృశించుచు హాస్యదార్శనిక ప్రవక్త గండోదర విప్రుడు పల్కిన—

'కాలము మారిపోయినది కంచరగాడిద చక్రవర్తి గు
ఱ్ఱాలకు సార్వభౌముడయి రాజ్యము చేయుచునున్నవాడు దీ
పాలను ఆర్పుచున్న వెధవాయియె బల్ మొనగాడు నేడు మా
ర్జాలము వ్యాఘ్రరాజ మొకజాతికి చేరెను దండుకేశ్వరా !'

అను పద్యము గోగ వెన్నుని విమర్శలో నిందితులసైతము నవ్వుకొనజేయగలదు. ఆధునికులలో పద్యకథలలో చాలమందికి సుకుమార హాస్యధోరణి గగనకుసుమము. మిత్రశ్రీ రామకృష్ణమాచార్యులవారికది నల్లేరుపై బండి. 'తారాశశాంకము' నందలి అజ్ఞాతకాంతేయము, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః అను రెండు ఖండికలును ఒకే రచయితవా అని సందేహించు సందర్భమున పఠితలు దీనిని స్మరింతురుగాక.

మూడవదియైన సంభాషణచారిమ ఉత్తరోత్తరవాక్య కల్పనము మన రూపకములందు కన్యాశుల్కమును దప్పించి మిగిలినవానిలో కొన్నిటియం దేకదేశ ప్రాశస్త్యమును పెక్కట మృగ్యము. సముచిత సంవాదరచనకు గ్రంథమంతయు లక్ష్యమే.

ఇందు యువరాజు మొదటిలో కేవల ప్రణయకషాయితుడు. భారతీయుడయ్యు చార్వాకమువెస మ్రొగ్గినవాడువోలె వ్యవహరించును. ధర్మస్థానఘట్టములో ప్రథమహృదయస్పందము— క్రమముగా బాలసూర్యునివలె కళలుమారి చివరికీపాత్ర తేజస్సామగ్ర్యమును సూచించును. అన్నిటికన్న

విచిత్రమైనది యువరాజు శాసనము యువరాజునకే శాసనమగునట్లుగ కల్పింప బడిన అంతరాయగాథ. ఇది జైమినీ భారతములోని ప్రభావతీ సుధన్వుల మహోజ్వలగాథవంటిది— అద్భుత కల్పన.

తరువాత చాణక్యుడు గణింపదగిన పాత్ర. ఇది యువరాజ పాత్రోన్మీల నముకన్న భిన్నమైనది. ఇతర పాత్రల గౌరవభీతులచే చాణక్యపాత్రను మన మూహింతుము. "మగధరాజ్యంలో ఎవడినీడ వాడు చూచుకొని చాణక్యుడని భయపడుతున్నాడు" ఇత్యాది.

ఇందు చరిత్రప్రసిద్ధులగు ప్రధానవ్యక్తుల నటుంచి ఉపకథలోని వారగు నీలకేతన మహాసేనుల కల్పనము రూపకమునకు మెరుగు తెచ్చినది. మహాసేనుడు వృద్ధు. రాజసేవలో ఖడ్గదీక్షలో గౌరవింపదగిన వార్ధకమును పొందెను. ఇక నీలకేతనుడో, సుఖవాంఛలు రెక్కలార్చు క్షయరోగి. ఈ ఇరువురికీ అతీతము పవిత్రము. "జ్ఞాపకముందా? ఆనాడు గ్రీకుల దండయాత్రలో నీవూ నేనూ సింధునది వరదలలో నున్నపుడు ఈదుకుంటూ అవతలిగట్టు చేరవలసివచ్చినది..." ఇత్యాది నీలకేతన ప్రసంగము "నాకే ఆశ్చర్యంగా వుంటుంది. నాకూ చంద్రగుప్తుడికీ స్నేహం కలవటం. ఒక నాటి శరద్రాత్రి..." ఇత్యాది మహాసేనుని వెనుచూపు తలపులు చాల హృద్యములైనవి. ఇది యువరాజు అధునాతత్వదృష్టికి ప్రతియోగి కల్పన. ఇంక కథావాహినికి మొదటినుండి తుదివరకు వెన్నెలనీడల వయ్యాళియగుటకు తిన్నె కల్పించినది గండోదరమిత్రుని హాస్యప్రియా లాఘవజీవితము.

ఈ నాటకములో ప్రధానము శాంతరసము. శృంగార హాస్యకరుణములు అవాంతరములు. ఇందు శృంగారమునకు యువరాజు, హాస్యమునకు గండోదరుడు, కరుణకు ఉషా నందినులు ఆలంబనములు.

ఇందలి స్మశానఘట్టము, ముఖ్యముగ నందలి వర్గాత్మక పద్యములు, వాఙ్మయమున అపురూపములు. ముక్కలుతీరిన ప్రౌఢకవి ప్రకాండులు కాని అట్టి రచనల జోలికి పోరు. అభిమన్యుని వధాఘట్టము తిక్కన వ్రాయుటనుగూర్చి అతిశయ కథలటుంచగ స్త్రీపర్వమును సత్యోగ్ర ప్రపంచ స్వభావమును ఆకళించుకొన్న ఒడ్డుచేరిన తిక్కన వ్రాయగలిగినాడు. బీభత్స భయానక ప్రాచుర్యమున గరుడాల్పక సారస్వతపథికులకు నాదారి పోనరిది. భోజుడు సీతారాముల విముక్తి వర్ణింపక విడుచుచు "తాదృక్ విధామపి కథాం కథయన్ స్వవాచా వల్మీకజన్మ మునిరేవ కఠోరచేతా" యని వ్యాజస్తుతి సల్పినాడు. ఈ సందర్భమునందలి పద్యములు పై ప్రసంగమును స్మృతికెక్కించును.

ఇందలి పద్యము లన్నియు రీతి సుభగములేయైనను,

"విజయ కళ్యాణిపైన ఓ బిందుసార
రాజచంద్రి సాగింపు సంగ్రామయాత్ర
అలకింపుము వినువీధి బాలభాను
సప్తరథ్య గంభీర హేషారవమ్ము"

అను పద్యము రత్నము. కాలికవర్ణనను రచయిత యెట్లు ముఖ్య సందర్భమున చేర్చెనో అరయునది. సాధారణముగ సంస్కృత నాటకములలో సైతము ప్రకృతి వర్ణనలు కేవల వర్ణనలుగనే మిగిలిపోవును. ఇది అపరిహార్యమయిన వర్ణనాసందర్భము. ఇందు ప్రకృతివర్ణనకు గుణిభావము లేదు. ఇదియు అపౌరుషేయవాక్కునం దగిలి బుగుజ్వాల మనిపించుచున్నది.

ఇట్లే, ఇందలి అలంకార సామగ్రియు చాల లలితము. "ఆగు! ఒక్కమాట. పుష్పసౌరభమువలెవచ్చి మలయమారుతమువలె దాటిపోతున్నావు" అంటాడు రసికశైకజీవి బిందుసారుడు. రుచి తెలిసినవారు తలయూపకుండుట కష్టము. సంస్కృత నాటకలలోవలె సహజమైన "పూలపిచ్చ" ఇందు ప్రత్యక్షము. ఇందలి విషయమిట్లు బహుళోపాధికమయ్యును అందకుండవడమియే రచయిత సామర్థ్యమును— ఒక్క గ్రంథమునందే ఎన్నో ఉత్తమ శిల్పరేఖలు ప్రదర్శించు ఆయన విశ్వదీప్తీన గమన దక్షతయు నుగ్గడువుగ నుగ్గడించును.

ఇందు చివరిదిగా మెచ్చదగిన దిందలిభాష. పద్యములందు గ్రాంథికము, పాటలలో గద్యలో వ్యావహారికము వాడబడినది. ప్రాకృతకవులు గాథలలో మహారాష్ట్రిని, వచనములో నంతకంటె తక్కువ బిగువుగల శౌరసేనిని వాడుదురు. గిడుగువారి అభిప్రాయము వ్యావహారికభాషోపయోగిత పట్లనిట్టిదని ఒక ప్రవాదము కలదు. సాంఘిక నాటకములనేగాక చారిత్రికములందుగూడ దీనిని ప్రసగింపవచ్చునని యీ రూపకమునందు సిద్ధాంతితము.

రూపకము ప్రదర్శనోపజీవియైనను కావ్యసూక్తులచేత అమరమగును. ఆ సూక్తులు గతానుగతములుగాక, కవి ప్రతిభాదర్శితమైన సత్యమును ఆలంబించునేని అక్షరబద్ధంబు లనిపించుకొనును. 'వసంతమంటే యౌవనం' అను యువరాజు సుభాషితమిట్టిదే. ఇట్టివనేకములు.

ఒకటి రెండుచోట్ల కొన్ని చారిత్రకవిరోధాంశములు కలవు. 'దెయ్యాలు చుట్ట కాల్చటం.' ఈ చుట్ట అలవాటు నేటిదేమో? అయినను రసనిరంతరమైన యీ గ్రంథసుభగశరీరమునకు ఇవి మచ్చలు కావు. అందమునుగూర్చు పుట్టుమచ్చలు.

"చెప్పేసెయ్—తుదివరకు—రక్తి కడుతుందిలే" అన్న దండుకేశ్వరునిమాట రూపకమునకే అన్వయించును. మొదట తెర యెత్తినది మొదలు చివరితెర జారువరకును ఒకే ఒక చాక్షుషక్రతువుగా కథ సాగినది. చంద్రగుప్తుడన్నట్లుగా "గంగానదీ వననికుంజాలమధ్య వికసించిన సుందర పుష్పం పాటలీపుత్ర శ్మశానవాటికలో వాడి బౌద్ధధర్మ జగత్తులో ఫలించింది. చాణక్యుడు నాటికి నేటికీ అద్వితీయ తేజోమూర్తి." "కుమారచక్రవర్తీ! యీ ధర్మాలు అహింసాప్రబోధము ఔపనిషదమైన ఆర్ష సంస్కృతికి వినూత నాలుకావు. కాలమహాస్రవంతి యుగయుగాంతరాలు క్రొత్త వెల్లువలతో పొంగి ప్రవహిస్తూంటుంది" ఇత్యాది సమ్యగ్దర్శన ప్రవచనముతో చాణక్య నిష్క్రమణము హిమాలయమునీడ కన్యాకుమారివరకు వ్యాపించి నట్లున్నది. కాలమహాస్రవంతిలో క్రొత్తవెల్లువ నాటకరంగమునకీ రూపకము క్రొత్త వెల్లువ—వట్టి వెల్లువగాదు. పరితప్తమైన సాహితీజహ్నుభూమికి పరవడించుకొని వచ్చే మిన్నేటి క్రొత్త వెల్లువ.

పుష్పోద్యాన పరిచయమునకు మహావాయువు రేగ నక్కరలేదు. మందమలయవాయువీచికలు చాలును. ఈ ప్రేక్షణకమునకు నా సంఖ్యేయ పరిచయవాక్యము లింతమాత్రమే. ఆపై పరిమళాస్వాద వైవశ్యమును రసికులు అనుభవింతురుగాత.

"రసికో హివ హేత్ కావ్యం
పుష్పామోద మివానిలః"

విరోధి : రథసప్తమి }
భీమవరం }

దిగుమర్తి సీతారామస్వామి



# నివేదన

"తెలుగుదేశములో ఉత్తమ నటులున్నారు; ఉత్తమ నాటకాలులేవు"— తెనాలిలో నవ్యసాహిత్య పరిషత్ సమావేశమున పూజ్యశ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి అభిభాషణము నాలో అనిర్వచనీయమైన పర్యుత్సుకీ భావమును రేకెత్తించినవి. అంతకుముందు ఆంధ్రవిశ్వకళాపరిషద్వేదికపై గురుదేవులు శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు "తెలుగులో నాటక రచన అచిరప్రవృత్తము. నేటి నాటకములలో ఒకచో సంభాషణ చారిమ, వేరొకచో పాత్రచిత్రణము, మరొకచో కవితా మాధుర్యము, ఇంకొకచో ఇతివస్తు నిర్మాణము మేలనిపించుచున్నవి. ఇట్లు ఏకదేశసిద్ధినిగాక సమగ్ర శిల్పసిద్ధి పొందిన నాటకము తెలుగులో అవతరింపవలసియున్నది" అని ప్రవచించిరి.

ఈ ఉపన్యాసములు కల్పించిన భవ్యకవితావేశ పరిణామమే యీ 'ధర్మచక్రము'.

మొట్టమొదటినుండి 'ధర్మచక్రము'పై మిక్కిలి మక్కువ వహించి నేటికి అక్షరరూపమున తెలుగులోకమున కందించిన రసజ్ఞ చక్రవర్తి, నాట్యకళాప్రపూర్ణులు శ్రీ పొన్నపల్లి సుబ్రహ్మణ్యంగారికి నా సుహృదభివాదాలు.

'ధర్మచక్రము'ను 'కృష్ణాపత్రిక'లో ప్రచురించి, ఉపోద్ఘాత ప్రాయముగ పరిచయవాక్యాలు అనుగ్రహించిన శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికీ, ఆమోదప్రసారమును రచించిన మిత్రులు సాహితీతపస్వి శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారికీ నా ధన్యవాదాలు.

'కవితాప్రభాస'
శ్రీ ముఖపురము
—నండూరి రామకృష్ణమాచార్య

# కృతి సమర్పణము

## మిత్రశ్రీ డాక్టరు పొన్నపల్లి సుబ్రహ్మణ్యంగారికి

---

హితునకు హాసన్ముఖమృదుల
చతురవచోనిధికి రసికసమ్రాట్టునకున్
అతుల కళాహేళా సం
తతమధురోదాత్త రంగనటరాజునకున్

నీ కనుదోయిలో రసధునీ కమనీయ తరంగనాట్య హే
వాకము చిందులాడు నవపల్లవకోమలరాగ దీధితిన్
మా కవితాప్రపంచ సుషమాసుకుమార మనోజ్ఞ భావనా
లోకము నీ హృదంతరములో వెలయింపు రసజ్ఞశేఖరా ! *

కవిని జగద్ధితాకాంక్షిని తన కను
రక్తిగా సల్పెను రాజరాజు
కావ్యకన్యనుగోరి కవిని మంత్రిగ జేసి
మామాయని పిలిచె మనుమసిద్ధి
కనకాభిషేకమ్ము కవిరాజునకు జేసె
దక్షిణాధిపతి ముత్యాలశాల
మదకరిడిగి కవి కెదురేగి కేలూనె
సాహితీ రసలోక చక్రవర్తి

అట్టి తెలుగు కృతిపతుల అమృత హృదయ
తరళ నిత్య రసజ్ఞతల్ తావకీన
కోమల నయనద్యుతులలో గోచరింప
కృతి సమర్పించినాను సుహృద్వరేణ్యా !

---

# ధర్మచక్రం

## ప్రథమరంగము

[స్థలం: పాటలీపుత్రం— వృద్ధసేనాని మహాసేనుని గృహం. ఒకమూల దగ్గుచున్న నీలకేతనుడు]

పరివేశం గండోదరమిశ్రుడు, దండుకేశ్వరుడు

గండోదరమిశ్రుడు:- దండుకేశ్వరా!

దండుకేశ్వరుడు:- గండోదరా! కర్తవ్యమేమిటి?

గండు:- చూడు, మహాసేనుడు ఇంటిలో వున్నాడో లేదో.

దండు:- ఉన్నట్లు కనిపించడంలేదు.

గం:- ఇంకెవరైనా ఉన్నారేమో చూడు.

దం:- ఎదురుగా ఒక ఆకారం ఎవరో వున్నట్లు అనుమానంగా వున్నది.

గం:- పలుకరించి చూడు.

దం:- ఓ! ఓహూ! ఎవరయ్యా! ఇదిగో! నీవు బ్రతికివున్నావా? చచ్చిపోయినావా?

నీలకేతనుడు:- (దగ్గుచూ) ఎవరు ప్రశ్నించేది? దండుకేశ్వరా! నీవేనా? నా దగ్గు వినిపించటంలేదా?

గం:- వినిపించకేమి? కొన్ని శవాలు చచ్చిపోయిన తర్వాత కూడా దగ్గుతాయట.

దం:- మా అమ్మమ్మ చచ్చిపోయిన తర్వాత శ్మశానంలో మూడు సార్లు దగ్గిందిట.

నీల:- దండుకేశ్వరా! యీ దగ్గు నా రక్తంపీల్చి నన్ను పిప్పి చేస్తోంది. జ్ఞాపకంలేదా! ఆ నాడు గ్రీకు దండయాత్రలో

నీవూ నేనూ సింధునది వరదలలో ఉన్నప్పుడు యీదు కుంటూ అవ్వలిగట్టు చేరవలసి వచ్చింది. నీవు ఈదలేక పోయావు. నేను ఆనాడు నీకు సహాయం చెయ్యకపోతే నీవీ నాడు ఏ లోకంలో ఉండేవాడివి ?

దం:- అధికప్రసంగం అనవసరం. అడిగినప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పు— నీవు బ్రతికివున్నావా ? చచ్చిపోయినావా ?

నీల:- నీకు కన్నులు కనిపించటంలేదా ! అసలే నేను దగ్గుతో బాధపడుతూంటే.

గం:- జరిగిపోయిన సంగతులు స్మరించి పారాయణముచేసుకుంటూ జీవించేవాళ్ళు చచ్చిపోయినవాళ్ళతో సమానం.

నీల:- దండుకేశ్వరా ! నేను చచ్చిపోలేదు. బ్రతికేఉన్నాను— ఉంటాను. నీలాంటి వాళ్ళిందరినో చూస్తేనేగాని చచ్చిపోను-

దం:- ఛీ ! దుర్మార్గుడా ! నోటికి వచ్చినట్లు పేలుతున్నావు— ఇప్పుడే నిన్ను చంపేస్తాను నీతాతఎవ్వరడ్డువస్తారో చూస్తాను

(ఒక చేతితో కత్తిదూసి మెడ పట్టుకుంటాడు)

నీల:- ఛీ! దుర్మార్గుడా! అమ్మో! చచ్చిపోయాను— నేను చచ్చిన తర్వాత నీ ప్రాణాలుండవు— మంత్రి చాణుక్యుడున్నాడు — మరిచిపోకు.

గం:- ఒరే! దండూ! ఒక్కసారి ఆగు! చాణుక్యుడు పేరు వినబడితే మూడు ఘడియలు ఏపనీ చెయ్యకుండా ఎనిమిది దిక్కులు చూచి ఆచమనం చెయ్యాలి— చాణుక్యుడిది డేగచూపు, పాముచెవులు— రాత్రి నిద్రపోయేటప్పుడు వాడిచెవులు దేశదేశాలకుపోయి అన్ని సంగతులు వినివస్తాయి- వాడి కన్నులు పాటలీపుత్రం మగధ రాజ్యం సంచార ప్రదక్షిణం చేసివస్తాయి- చాణుక్యుడు సర్వాంతర్యామి- అమాంతంగా ఇప్పుడు ఇక్కడ ప్రత్యక్షమైపోవచ్చు—

దం:- ఆఁ ఆఁ (కత్తినిలిపి)- ఎల్లాగరా! వీడిని చంపేస్తానని ప్రతిజ్ఞ చేశానుగదా !

గం:- అదికాదురా! వీడు అసలు ఇదివరకే చచ్చిపోయాడు కాదురా! ఇంక వీడిని చంపటం ఎందుకు?

దం:- అమ్మయ్య! బాగాచెప్పావు నిజమే! ఒరే! నీలకేతనా! నీవు నా ముందు ఒక కుమ్మరి పురుగువు- ఇకమీద జాగ్రత్త!

నీల:- మేడిపండులాంటి మీ దేహాలనుచూచి సంతోషించకండి. ఈ దేహాలు నీటిబుడగలవంటివి——

గం:- శరీరంలో జబ్బు ప్రవేశించిన వెంటనే మనస్సులో వేదాంతం ప్రవేశిస్తుంది. ఓరీ చవటపీనుగా! నీ మెట్టవేదాంతం మాకుపదేశించవద్దు. నేను ఎవరినో తెలుసునా? చెప్పరా! గండూ!

దం:- ఈ మహాపురుషుడు ఎవరో తెలుసునా? మగధసామ్రాజ్యంలో ఈయనను ఎరగనివాళ్లు ఎవరూలేరు.

నీల:- ఎరగనివాణ్ణి నేనున్నాను.

గం:- నన్ను బ్రతికివున్నవాళ్లందరూ ఎరుగుదురు. నీకు తెలియదులే.

నీల:- పోనీ మీ రెవరో దయచేసి చెప్పండి.

గం:- శ్రీ మహారాజరాజశ్రీ మేము మగధసామ్రాజ్య సార్వభౌముని ఏకైకపుత్రుడు శ్రీ శ్రీ శ్రీ బిందుసార యువరాజచంద్రునకు అంగరక్షక సేనాని శ్రీ శ్రీ మహామండలేశ్వర గండోదర మిశ్రులము.

దం:- మేము శ్రీ శ్రీ మహామండలేశ్వర సేనాని గండోదర మిశ్రుల వారి ఆత్మరక్షకుడను, ఆర్య దండుకేశ్వర మిత్రులము.

గం:- నీలకేతనా! నీకు రాజమర్యాద తెలియదు. మేము రాగానే——'ఆర్యమహాశయా! గండోదర మిశ్రమహామండలేశ్వర సేనానిగారూ దయ చెయ్యండి, ఇట్లు సుఖాసీనులు కండు' అని గౌరవించవద్దూ?

దం:- 'మహాశయా! దండుకేశ్వర మండలేశ్వర సేనానిగారూ! ఇటు దయచెయ్యండి' అని నమస్కరించవద్దూ?

నీల:- అయ్యా దయచెయ్యండి.

గం:- మహాసేనుడు ఎక్కడున్నాడు ?
దం:- నందిని యెక్కడుంది ?
నీల:- కాశ్మీరంనుంచి తెచ్చిన జాతి సంపెంగి లత పుష్పించింది, వనంలో వున్నారు.
దం:- నందినికూడ అక్కడే వున్నదా ?
గం:- ఈ పిచ్చి నందినికికూడా యెక్కిందా ? పాటలీపుత్రానికి పువ్వులపిచ్చి యెక్కిందోయి——

మహాసేనుడు : (ప్రవేశం)

గం:- ఆర్యసేనాని మహాసేన మహామండలేశ్వరునకునమస్కారాలు·
మహా:- నమస్కారాలు....కూర్చోండి, ఇట్లావచ్చారేం...
దం:- అబ్బే రాలేదండి. ఊరికినే వచ్చాము.
గం:- తమరు సేనాధిపతిగా వున్నప్పుడు గ్రీకుదండయాత్రలో వీడుకూడా వున్నాడుట — తమ దర్శనం చేసుకోవాలని వచ్చాడు.
మహా:- ఆఁ అవును, ఆషాడశుద్ధ పాడ్యమినాడు మేము సింధు నదీతీరాన దండువిడిసినాము. కాలం మారిపోయింది. ఆనాడు యుద్ధభూమిలో నా 'మధురహేష' ను అధివసిస్తే—— ఇప్పు డేముంది
గం:- ఇప్పుడు మటుకు—— మీరు కాశ్మీరంనుంచి ఏదో లత తీసికొని వచ్చారట. ఈ వేళ ప్రొద్దున ఆ పుష్పపరిమళం పాటలీపుత్రం అంతా గుమ గుమ లాడిపోయింది.
మహా:- ఆఁ ఆ పువ్వు ఇప్పుడే వికసించింది. పొద్దున్నే పరి మళం ఎట్లావచ్చింది ?
గం:- ఏముంది——పుట్టగానే పరిమళిస్తుంది, చూడండి. ఆ పువ్వును చూడటానికే నేను వచ్చాను. మీ విషయం దండుకేశ్వరుడు నాతో చెపుతూంటాడు.
మహా:- ఇది నా జీవితంలో అపర సంధ్యాసమయం. నాకే ఆశ్చర్యంగా వుంటుంది. నాకూ చంద్రగుప్తుడికీ స్నేహం

కలగటం—ఒకనాటి శరదాత్రి—చంద్రుడు రోహిణీ నక్షత్రం దగ్గర వున్నాడు పుష్యమాశుక్రుని అలతి అలతి కాంతులు ముఖమండలములో ప్రతిఫలిస్తూ చంద్రగుప్తుడు నా మైత్రిని కోరినాడు.

గం:- మీ అమ్మాయి నందినికి పువ్వులంటే చాలా ఎక్కువ ప్రీతి అనుకుంటాను. మీ వనంలో దోహద విధానాలు ఏమైనా చేస్తున్నారా ?

మహా:- అట్టేలేదు ! నాకు వృక్షశాస్త్రంలో పరిచయం లేదు.

గం: కాకరగింజలు తెచ్చి పొట్లకాయకు బెజ్జముపొడిచి అందులో పడవెయ్యాలి. పొట్లకాయ ఎదిగి పండిన తర్వాత ఆ గింజలు తీసి పాదుతే— కాకరతీగ బయలుదేరుతుంది—కాని పొట్ల కాయలు కాస్తాయి.

మ:- ఆ ! ఆశ్చర్యం—అమ్మా ! నందినీ !—చూడు నీలకేతనా ! ఈ విషయం జ్ఞాపకం వుంచుకొని నందినితో చెప్పు.

నందిని (ప్రవేశం)

నందిని—కొదమతుమ్మెద తుళ్ళింతాలు
కొంటెకోకిల కేరింతాలు
మలయపవనుని గిలిగింతాలు
సెలయేటిలో ఎలమావిపై
ఉద్యానవని ఉయ్యేలలూగు—"

నాన్నగారూ !
పిలిచారా !

మహా:- తల్లీ! కాకరతీగకు పొట్లకాయలు కాస్తాయట.

నంది:- ఎవరు చెప్పారు !

గం:- అంతేకాదు! నందినీ! గుమ్మడికాయకు చిల్లుపొడిచి అందులో కొంచెం తేనెతో వంగగింజలు వెయ్యాలి. ఆ గుమ్మడికాయ పండిన తర్వాత ఆ వంగగింజలు నాటితే గుమ్మడి తీగె మొలిచి కణుపు కణుపుకూ గుత్తివంకాయలు తెగకాసేస్తాయి.

నందిని:- నిజమే.

మహా:- కాలం మారిపోయింది. ఈనాడు యువకు లందరు పుష్పాలు, లతలు, ఉద్యానవనాలలో మధుర స్వప్న వాటి కలలో మేఘమండలాలలో విహరిస్తున్నారు. గుమ్మడితీగకు వంకాయలు ఎట్లాకాస్తాయా? గుత్తానికి గాడిద ఎట్లా పుడు తుందా?—ఇవేనా యువకులు చర్చించవలసిన సమస్యలు. ఆనాడు మేము గ్రీకులను ఎదిరించామంటే!

గం:- ఇప్పుడు ఆ భయం ఏమీ లేదుగదా! గ్రీకులను ఇదివరకే ఓడించేశాముగదా!

మహా:- ఏమో ఎవరు చెప్పగలరు. తిరిగి మళ్ళీ విజృంభించ కూడదా? సింధునదికి అవతలి ఒడ్డున గ్రీకురాజ్యం ఇంకా మగధ సామ్రాజ్యంలో కలిసిపోలేదు ఆనాడు ఎంతమంది యువకులు ఆత్మబలిదానంచేసి మాతృదేశంనుండి విదేశీయులను తరిమివేశారు

గం:- ఆ మహావీరులు చిరస్మరణీయులు.

మహా:- ఈ నీలకేతనుడు ఆనాడు 10 ఏండ్ల బాలుడు. ధ్వజం పట్టుకొనేవాడు. ఈనాడు దగ్గుపట్టుకొని వీడిని పీడిస్తోంది. మనలో వీరపూజ నశించింది. వీడిగతి కనుక్కొనేవాళ్లు ఎవరూ లేరు!

గం:- ఆఁ! అట్లాగా! నీలకేతనా! నమస్తే! నమోనమః. నిన్నుచూస్తే గ్రీకుదండయాత్ర చరిత్ర చదువుకోనక్కరలేదు. (ప్రదక్షిణంచేసి) నీ విషయం యువరాజుతో చెప్పి తగు సహాయం చేసే టట్లు చూస్తాను. మహాసేన మహాశయా! మీ ఉజ్వల జీవిత చరిత్ర మాబోటి యువకులకు ధ్రువతారవలె నిశ్చల లక్ష్య ముగా వుంటుంది.

మేఘవాహనుడు:- (ప్రవేశించి) ఆర్యమహాసేన మహామండలేశ్వరులకు నమస్కారాలు

మహా:- ఆశీర్వచనాలు.

గం:- సుహృదభివందనాలు.

మే:- అభివందనాలు. గండోదరమిశ్రీ! దండు కేశ్వర! మీ కోసం యువరాజుగారు శోణాతీరందగ్గర నిరీక్షిస్తున్నారు.

గం:- ఆర్యా! నమస్కారాలు. పోయివస్తాను.

మహా:- యువరాజుగారికీ మీకు సంబంధం ఏమిటి?—

గం:- యువరాజు నాకు వరుసకు తమ్ముడులెండి. వాడు నన్ను వదలి ఒకక్షణం వుండలేడు. మేఘవాహనుడికీ ఆ విషయం తెలుసును.

మహా:- మీరందరు ఒక్క విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. రాజుల గౌరవం, వేశ్యలప్రేమ, మెరపుతీగెలకాంతి ఎంత అనుభోగనీయాలో అంత అపాయ గర్భితాలు.

గం:- మహాశయా! శలవు! అనుభోగం వాంఛించేవాడు అపాయానికి భయపడకూడదు. యువరాజు నాకోసం బెంగపెట్టుకొని వుంటాడు యీపాటికి.

దం:- శలవు.

(నిష్క్రమిస్తారు)

మహా:- మేఘవాహనా! యీ వినాయకుడు ఎవరోయి?

మేఘ:- జగన్మోహిని పేరు విన్నారుగదా? ఆ వటవృక్షశాఖలపై విహరించే పక్షీంద్రుడు వీడు

మహా:- అయితే యువరాజుకు వీరికి స్నేహం ఏమిటి?

మేఘ:- జగన్మోహిని కూతురు ఉషాసుందరి ప్రణయవాగురులలో యువరాజు కమ్మని కలలు గంటూ కలవరింతలతో కాలం గడుపుతున్నాడు.

మహా:- ఏమిటీ!—చూడు జగన్మోహినికి కూతురు ఎవరూలేదే?

మేఘ:- గండోదరుడు ఒకసారి ఉత్ప్రేక్షించాడు. ఒకనాడు ప్రాతస్సంధ్యాసమయంలో యువరాజు గంగాతీరానికి విజయకళ్యాణిపై వాహ్యాళికి వెళ్లాడుట. ఆ సమయానికి ఉషాదేవి మాసేవ స్త్రీ రూపందాల్చి గంగానదిలో స్నానం చేస్తున్నదట. యువ

రాజు ఉషాసుందరిని తీసికొనివచ్చి జగన్మోహిని ఇంటిలో పెట్టాడుట.

మహా:- తెలిసింది. చంద్రగుప్తుడు, యువరాజు ఏ రాజకన్యకనో గాని వివాహం చేసుకొనేందుకును అంగీకరింపడు. అందుచేత భయపడి జగన్మోహిని ఇంటిలో ఏ సామాన్య కుటుంబానికో చెందిన ఉషాసుందరిని అప్పగించాడు.

మేఘ:- ఏమో నిజం ఎవరికి తెలుస్తుంది.

మహా:- ఛీ' మగధసామ్రాజ్యానికి మా కండ్లయెదుట ఎట్టి నైచ్య స్థితి సంక్రమించింది! ఎంతమంది రాజకన్యలు లేరు?

మేఘ:- యువరాజు ఉషాసుందరినే వివాహమాడి పట్టమహిషిని చేయ సంకల్పించుకొన్నాడు. ముసలి చక్రవర్తి చంద్రగుప్త సార్వభౌముడు మరణించిన మరునాడు వివాహముహూర్తం.

మహా:- మగధసామ్రాజ్యానికి కాబోయే పట్టమహిషి వేశ్యాసుందరి జగన్మోహిని పెంపుడుకూతురన్నమాట! బాగుంది! ఈ విషయం చాణుక్యమంత్రికి తెలుసా?

(చాణుక్యమంత్రి ప్రవేశం)

చాణు:- తెలుసును! మహాసేన మహాశయా! తెలుసును! ముసలి చక్రవర్తి అప్పుడే మరణింపడు. చాణుక్యుని బుద్ధి ఎప్పుడూ నిద్రింపదు.

మహా:- మహామంత్రీ! మా గృహం పావనమైనది. ఈ ఆసనమును అలంకరింప ప్రార్థన. సూర్యభగవానుడు మీ ఆజ్ఞననుసరించి ఉదయిస్తున్నాడు. దైవం కూడ మిమ్మల్ని వంచింపలేదు. మహామంత్రీ—నీ బుద్ధిబలాన్నిగాని చంద్రగుప్త చక్రవర్తి పరాక్రమాన్నిగాని శంకించటంలేదు. అవసరమైతే నా 'రక్తహాసం' తిరిగి విజృంభిస్తుంది.

మే:- మహామంత్రిపుంగవులకు మేఘవాహనుని నమస్కారాలు.

చాణు:- మహామండలేశ్వరా? నీ రక్తహాసం మగధసామ్రాజ్యానికి తొలి ఉషస్సులు కల్పించింది! నీవు ధన్యుడవు మేఘవాహనా!

సామ్రాజ్య శిక్షణాగారానికి యువరాజు యథాక్రమంగా వస్తున్నాడా?

మేఘు:- ఆఁ! నిన్ననే క్రీడాయుద్ధంలో మత్తేభయూధాలకు నాయకత్వం వహించాడు. సంగ్రామవిద్యలో ఆరితేరిన మహావీరుడు యువరాజు.

చాణు:- మహామండలేశ్వరా! నీ రక్తహాసమును ప్రశాంతముగా విశ్రమింపనిమ్ము.

మహా:- మహామంత్రీ! ఒకమూల పాషండులు ప్రబలిపోతున్నారు. బౌద్ధులు బయలుదేరి అహింస జీవకారుణ్యాలని జాతిని నిర్వీర్యులుగా మారునట్లు ప్రబోధిస్తున్నారు. యువరాజే వేశ్యాలోలుడైతే ఇక మగధ సామ్రాజ్యానికి గతి ఏముంది?

రక్తహాసకాంతులు మహారాజ్ఞి వేశ్యాపుత్రికా పాద శింజినీ రత్న ప్రభారాగ పంక్తులలో కలసిపోయే కాలం వస్తుందా? మహామంత్రీ!

చాణు:- రావటంలేదు, ఎన్నటికీ రాదు! యువరాజు నాకు ఒక సమస్యగా పరిణమిస్తూ వున్నమాట యథార్థం. కాని వేశ్యాపుత్రిక యువరాజును కాంక్షించటం మృత్యుదేవతను ఆహ్వానించటం. ఆ వివాహం ఎన్నటికీ జరుగదు. భూత వర్తిష్యమాణ చరిత్రలనువిర్మించిన చాణుక్యమంత్రి ఈనాడే భవిష్యత్కాల చరిత్రను శాసించివేశాడు.

(నిష్క్రమించును)

మ:- మేఘవాహనా! మహామంత్రిని సాగనంపివస్తాను.

(నిష్క్రమిస్తాడు)

నందిని:- నీలకేతనా చూశావా! మహామంత్రి మన యింటికి వచ్చాడు. అయ్యోపాపం ఆలస్యమైంది. నీకు మందు ఇవ్వటానికి వీలులేక ఆలస్యమైపోయింది.

(మందుకుప్పి అరగదీస్తూ)

పొదరింటిలో తలిరాకుపై
సన్నజాజులు సంజకాంతుల
ఉద్యానవని ఉయ్యెలలూగు.

నీలకే:- నందినీ! నీ చిరునవ్వులతో రంగరించి అనుపానంగా ఈ మందు ఇస్తూవుంటే నా వ్యాధిని, నన్ను, ప్రపంచాన్ని మరచిపోతాను.

నందిని:- నీ మాటలు నాకు అర్థంకావు, నీలకేతనా! నీకు రోగంకుదిరి బయటపడు, అంతేకావాలి.

నీలకే:- నా అనారోగ్యం నిన్ను చూచేసరకే పోతుంది. నిజమే నాకు మాటలురావు. నా మాటలు చెప్పలేని అర్థాన్ని నా కన్నులు నీకు చెప్పటంలేదూ! నందినీ చూడు.

నంది:- నీ కండ్లలో జబ్బు కనుపిస్తోంది. అబ్బో నీలకేతనా నీ కండ్లలో రక్తంలేదు. ఇదిగో మందుతాగి పడుకో.

నీలకే:- నందినీ!

నంది:- ఏం కావాలి! దాహం కావాలా! ఇదిగో ఆయాసం పడకు.

నీలకే:- నందినీ! మేఘవాహనుడు మనయింటికి ఎందుకు ఇంతతరచుగా వస్తున్నాడో నీకు అర్థమైందా!

నంది:- నీకెందుకు మా నాన్నగారికోసం వస్తున్నాడు.

నీలకే:- కాదు నందినీ! నీ కోమలనయనద్యుతులు అతని తరుణహృదయానికి గిలిగింతలు పెడుతున్నాయి. అది నాకు చాలా అసూయగా వున్నది.

నంది - నీలకేతనా! అసూయ ఇతరులను ఏమీచెయ్యలేదు. అసూయాపరుణ్ణి దహించివేస్తుంది. నీ దేహంలో వ్యాధి మనస్సులో ప్రవేశింపనియ్యకు. నిన్నుచూస్తే నాకు జాలివేస్తోంది. పడుకో.

(నిష్క్రమిస్తుంది)

(—తెర—)

# ధర్మచక్రం



## ద్వితీయ రంగము

[స్థలం : పాటలీపుత్రం: ఉషాసుందరిగృహం]

గండోదరమిశ్రుడు :- ఉషాదేవీ ! ఉషాదేవీ !!

ఉషాసుందరి :- (ప్రవేశించి)- గండోదరా! ఏం అట్లా అరుస్తున్నావు ?

గం :- వచ్చాడా ?

ఉష :- ఎవరూ ?

గం :- మా తమ్ముడు.

ఉష :- నీకు తమ్ముడెవ రున్నారు ?

గం :- నా ప్రాణస్నేహితుడు. ఇప్పుడైనా తెలిసిందా ?

ఉష :- దండుకేశ్వరుడా !

గం :- ఛీ, వాడు నా భృత్యుడు; తెలియదా మా తమ్ముడంటే; యువరాజు.

ఉష :- బాగుంది- ఇంకా రాలేదు- (నిష్క్రమణము)

( దండుకేశ్వరమిత్రుడు ప్రవేశం )

దం :- గండోదరమిశ్రులకు నమస్కారాలు

గం :- కృష్ణార్పణమస్తు !

దం :- నాకు రావలసిన ధనం ఏమైనా మిగిల్చావా ?

గం :- మిగల్చకేం ! ధనానికి లోటేమిటిరా ! 'సాహసేలక్ష్మీ,' అనరే ! ఏం జరిగిందో విన్నావా ?

దం :- ఏంజరిగింది ?

గం :- డబ్బుసంచి తీసికొని ఓడలోనుంచి బయటకు వచ్చాను. నీవు అట్లా వెళ్ళావు! అంతలో నలుగురు నల్లటి దొంగలు నా మీద విరుచుకుపడ్డారు. నేను కత్తితీశాను.

దం :- ఆఁ నీకు ఏమీ దెబ్బలు తగులలేదురా ?

గం :- వినరా! విను, తొందరపడకు. అంతలో పదిమంది నామీద ఒక్కసారి ఏటవాలుగా పడ్డారు.

దం :- అప్పుడే నలుగురు పదిమంది అయ్యారే!

గం :- ఒరే! దండూ! అడ్డదిడ్డంగా పానకంలో పుడకలాగ పిచ్చి ప్రశ్నలు వెయ్యకు. అంతా విను. నీకే బోధపడుతుంది. నల్లటివాళ్లు నలుగురు. తక్కిన ఆరుగురు ఎట్టగా వున్నారు. మొత్తంపదిమంది తెలిసిందా !

దం :- సరే కధ కానియ్యి. నేను ఊఁ గొట్టుతాను.

గం :- ఆ పదిమందితో ఘోరయుద్ధం చేశాను. నా కత్తిదీసి ముగ్గురిని చంపి శోణానదిలో పారవేశాను. ఇరవైమంది విచ్చుకత్తులతో నామీద పడ్డారు.

దం :- అప్పుడే పది ఇరవై అయిపోయింది.

గం :- ఆగరా! యీ యిరవైమంది కత్తులతో వున్నారు. కత్తులు దీసి మీద కురికారు. వెంటనే ఆ ముప్పైమందితో ఏకటాకీని యుద్ధంచేశాను.

దం :- సరే! చెప్పు చెప్పు, ఇరవై అల్లా ముప్పై అయిపోయింది.

గం :- ఒరే! మొట్ట మొదటి పది యీ ఇరవై కలిసి ముప్పై కాదురా! వెఱ్ఱిమొహం. చిన్నకూడికలుకూడ రావేమిటిరా నీకు. చిన్నతనంలో వీధిబడిలో నోటిలెక్కల్లో నీకు బండిసున్నా వచ్చిఉండాలి.

దం :- ఆఁ సరే—చెప్పేసెయ్యి తుదివరకూ! కధరక్తిగట్టుతుందిలే.

గం :- ఒరేదండూ! అబద్ధం చెప్పితే నీమీద వొట్టు. ఆ నలభైమందికలిసి నన్ను చేతులు కాళ్లు కట్టి డబ్బుసంచీలాగుకొని వెళ్లిపోయారురా! సరే యీ కత్తిచూడు ఎట్లాచిట్లిపోయిందో.

దం :- ఒరకు ఏమీ దెబ్బతగులకుండా కత్తి ఇట్లా చిట్లిపోయిం దేమిటిరా!

గం :- నేను కత్తితో యుద్ధంచేశానా? ఒరతో యుద్ధంచేశానా?

దం :- సరే! నీ యిష్టం. నీకు నమస్కారం.

గం :- నీకు నమస్కారం.

దం :- చాణుక్యార్పణమస్తు!

గం :- అదేమిటిరో!

దం :- నీకు తెలిసిందే! పాటలీపుత్రంలో ప్రధాన న్యాయ మూర్తిగ నందిని తండ్రిని మహాసేనుని చాణుక్యమంత్రి నియ మించాడు.

గం :- అయితే మనకేం. మనవంటి పెద్ద మనుష్యులు పేచీకోరు లుండే న్యాయస్థానాలకు పోరుగదా!

దం :- నిన్న సాయంకాలం మన తామ్రపర్ణివర్తకులు చాణుక్య మంత్రి దగ్గరకు వెళ్లారుట.

గం :- ఆఁ ఇంకా వాళ్లు బ్రతికేవున్నారా! పోనీ ఏడవనీ! మన కేం! ఇందుకేనా యింతభయం. ఓరీ పిరికిపంద—భారతమాత నీవంటి పారుబోతులను కన్నందుకు కన్నీరు కారుస్తోంది.

దం :- ఊరికే కోతలు కొయ్యకు! చాణుక్యుడు స్వయంగా ఈ విషయం పూనుకున్నాడట.

గం :- నిజమే! నిజమే! విజయలక్ష్మి పారుబోతులను వరించదు. భయపడకు దండూ! మనం చాణుక్యమంత్రికే దొరకం. ఇల్లాంటి చిల్లరవిషయాల జోలికి మహామంత్రిరాడు.

దం :- కాదు గండోదరా! ఎందుచేతనో చాణుక్యుడు నీడవలె మన వెన్నంటి తిరుగుతున్నాడు. మొన్న శుక్రవారంనాడు రాత్రి ౧౨ ఘడియలకు మా యింటి తలుపులీస్తేయిద్దరు భటులు కన్పించారు.

గం :- మగధరాజ్యంలో ఎవడి నీడను వాడు చూచుకొని చాణు క్యుడని భయపడుతున్నాడు.

దం :- నీ ఉపన్యాసం కట్టిపెట్టు. నేను అంతా చెప్పివేయదలుచుకున్నాను. నీవు డబ్బు తీసికొనివెళ్లి పూటకూళ్ల పెద్దమ్మకు ఇచ్చావుట. రత్నాలు ముత్యాలు అన్నీ భటులు పట్టుకొని చాణుక్యమంత్రికి అప్పగించారుట.

గం :- ఓసి బోడిముండా! ఎంతపని చేశావే! ఓరే! దండూ! నీ వంతు నీ కిస్తానుగాని—

దం :- నాకు ఒక చిల్లిగవ్వకూడా అక్కరలేదు. నిన్ను భటులు ఇప్పుడువచ్చి పట్టుకొంటారు. నన్ను ఇందులో ఇరికించకు— నీకు పుణ్యం వుంటుంది. సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను.

గం :- వత్సా! లెమ్ము! భయములేదు. నిన్ను రక్షించెదను. ఒరే! అడుగుల చప్పుడు. లే! పోదాం. ఇక్కడ ఇక క్షణం కూడా వుండకూడదు. ( నిష్క్రమిస్తారు. )

[బిందుసారుడు—ప్రవేశం]

యువరాజు:- ఉషాసుందరీ !

ఉష :- (ప్రవేశించి) ఆర్యపుత్రులకు స్వాగతం.

యువ :- వసంతోద్యానవనంలోకి రమ్మని చెప్పమన్నాను, గండోదరుడు చెప్పలేదూ !

ఉష : నాతో ఏమీ చెప్పలేదే! మన తలుపుతీస్తే ఉద్యానవనం- వెళ్లవచ్చు. తొందరేమున్నది ?

యువ :- పోనీలే ! మాట. ఏమిటీ అంతదూరంగా పోతున్నావు?

ఉషా :- ఆగండి ! చందనం తీస్తున్నాను.

యువ :- ఉషా ! చూడు. మామిడిచెట్లు చిన్న చిన్న పిందలతో ఊగులాడుతున్నాయి. వేపచెట్టుకూడపూతపట్టింది. రా, పోదాము.

ఉష :- వసంతోదయం అయినది. ఉద్యానవనం మిసమిస లాడిపోతోంది.

**యువ** :- వసంతం అంటే యౌవనం. సౌందర్యం ఒక్కటే వుంటే లాభం లేదు. సౌందర్యంలేని యౌవనం, యౌవనం లేని సౌందర్యం వ్యర్థం.

కోయిల కమ్మగా వగరు గొంతుకతో ఎలమావి గున్నలన్
కోయని కొమ్మ కొమ్మ పయి కోమలగీతిక లారభించె ; లే
బ్రాయము పాలపొంగు ; క్షణభంగురముల్ మన జీవితమ్ము లో
ప్రేయసిచేరరమ్ము, విహరింపగ ఈ సెలయేటితిన్నెలన్.

**ఉష** :- ఆగండి ; పుష్పమాలలు తీసికొని ఒక్క క్షణంలో వస్తాను.

**యువ** :- ఆగు! ఒక్కమాట! పుష్పసౌరభంవలెవచ్చి, మలయ మారుతంవలె దాటిపోతున్నావు.

**ఉష** :- ఆగండి! కూర్చోండి— (చందనం అరగదీస్తూ)

మోహనరాగము
ఆలపింపవే మురళీ! మురళీ!
పొదరింటిపైన పూలతో లతలు
అల్లిబిల్లిగను అల్లుకొన్నాయి
సిగ్గుదొంతరల చిన్నారి విరులు
చిలిపి చిరునవ్వు చిందుచున్నాయి....మోహనరాగము॥

కన్నెవలపులో లేత వెన్నెలలు
వెన్నపూసవలె కరగిపోయాయి
సెలయేటిపైన కెరటాలలోన
చందమామదిగి చిందులాడేను...మోహనరాగము॥

ఇదిగో చందనం సేవించండి, పూలమాలలు తీసికొని క్షణంలో వస్తాను.

యువ :- ప్రేమరస తరంగిణీ!

కాయమశాశ్వతమ్ము; క్షణకాలము పోయిన రాదు సంజ కెం
జాయలు గ్రమ్మె పశ్చిమదిశాముఖమందు విలంబమా సఖీ!
మాయజగత్తు; నీవొక అమాయికురాలవు పూలమొగ్గలే
పూయును గాని వాడి పడిపోయిన పూవులు పూయవెన్నడున్.

ఉప :- ఇదిగో కమ్మని కస్తూరి, మరువం దవనం మెలిపికట్టిన పుష్పహారాలు.

మల్లెమొగ్గలు మందమారుతములలోన
చిన్నారి చిరునవ్వు చిందుచుండ
చంద్రకాంతమ్ములు సంజ కాంతులలోన
వికసించి రమ్మని పిల్చుచుండ
కనకాంబరమ్ములు కల కల నవ్వుచు
చిగురాకుసందుల చిందులాడ
సన్నజాజులు నూత్న సౌరభములు చింది
పందిరిపై నుండి పలుకరింప
నవవసంతమహోదయోత్సవములోన
పూపవలపుల పొంగులు పొంగువేళ
పూచినట్టిపూలు ప్రణయపూజకొఱకు
కోసికొనివచ్చి మాలలు గ్రుచ్చినాను.

యువ :- ప్రేమతపస్వినీ! నీ వసంతపూజకు సంతోషం.

ఉప :- సంతోషించుచు గున్నమావివలె నిలబడిన ఎట్లాగ?

యువ :- కృతార్థుడను! నతశిరస్కుడై ప్రణయపిపాసువు నీ పాద మూలమున నిల్చినాడు...(చెయ్యిపట్టుకొనును)

ఉప :- చెయ్యిపట్టుకోవద్దని ఎన్నిసారులు ప్రార్థించాలి. ఆగండి జడకుచ్చులు ఊడిపోతాయి.

యువ :- సౌందర్యోపాసన నా జీవితారాధన.

ఉష :- అయితే దూరంగావుండి ఆరాధించవచ్చునుగదా! చెయ్యి వదలిపెట్టండి; నలిపి వేస్తే ఉక్కిరి బిక్కిరై పోతాను.

యువ :- వెఱ్ఱిదానా! ఝుంకరించేతుమ్మెదనుచూచి పువ్వును భయపడుచున్నదా?—రా!

ఉష :- ఆగండి! కొంగువదలిపెట్టండి—మీరు మగధ సామ్రాజ్య సార్వభౌముని ఏకపుత్రులు. భావిభారత సామ్రాజ్య చక్రవర్తులు. నేను ఒక దాసీకన్యనై మీ అంతఃపుర ద్వార తోరణంలో వాడిపోయే పుష్పంగామారిపోవాలనా? మీఊహ.

యువ :- ప్రేమతపస్వినీ! నీ బాధ నాకు అర్థమైనది. నేను భావిభారత సామ్రాజ్య చక్రవర్తినైతే నీవు భావిభారత సామ్రాజ్య మహారాజ్ఞివి. నీవు నా దేవేరివి. జీవితేశ్వరివి.

ఉష :- ఇది సంభవమా? ప్రభూ!

యువ :- ఉషాదేవీ! నామాట శంకిస్తున్నావా?

ఉష :- మీమాట శంకించటం లేదుగాని నాకు అట్టి అదృష్టం లేదని నా అంతరాత్మ శాసిస్తోంది.

యువ :- నామాట నమ్ము! ఉషాదేవీ!

ఆయువు గల్గు నాల్గుగడియల్ మన జీవితమొక్క స్వర్గమున్
జేయగవచ్చు; రమ్ము, వికసించిన పూలరసాలవాటికా
చ్ఛాయల సందులన్ బుడుతచంద్రుడు వెన్నెలలొల్క, స్వర్గశో
భాయతమయ్యె పుష్పవనమంత వసంత మహోదయమ్ములో.

ఉష :- ఆర్యపుత్రులు ఒక్కవరం అనుగ్రహించాలి.

యువ :- రెండువరాలు ఇచ్చాను కోరుకో.

ఉష :- ఈ సౌధంలో నివసిస్తున్నప్పటినుంచి శరజ్జ్యోత్స్నా సుషమా సుందరమైన నా ప్రణయాకాశంలో నీలమేఘాలు విహరిస్తున్నాయి. పరమ పవిత్రమైన దాంపత్యమే నా ప్రణ

యానికి లక్ష్యం అగ్నిసాక్షిగా వివాహం చేసికొనేవరకు నన్ను మీరు స్పృశింపకూడదు.

యువ :- ప్రణయతపస్వినీ— నీ సుగుణ సౌశీల్యాలు నాకు పరమాదర పాత్రాలు. నీ హృదయాన్నిమన్నించటం రాజపుత్రునికి తెలుసు. ఎవరూ వచ్చేది?

బౌద్ధసన్యాసి— ( ప్రవేశించి )

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి.

ఉష :- భగవన్! నమస్కారములు.

బౌద్ధ :- ధర్మసోదరీ! ధర్మసోదరా! ఆశీస్సులు.
—కుమారచక్రివర్తీ! నీ దర్శనమునకయి ఎంతో కాలము నుండి నిరీక్షిస్తున్నాను. బుద్ధభగవానుని కరుణవలన నేటికి సమకూరినది.

యు :- సరే! కూర్చొనుడు.

బౌద్ధ :- రాజనందనా! హింసాజర్జరితమైన ఈ ప్రిపంచమ్మును ఉద్ధరించుటకు కరుణామయుడైన బుద్ధభగవానుడు దివ్యసందేశమును వెలయించినాడు. రాజ్యచక్రమును శాసించు మహారాజులు ధర్మచక్రిమును శిరసావహించిన, భూలోకము స్వర్గలోకముగా వెల్లివిరియగలదు.

యువ :- మహాశయా! మీ ప్రిబోధము ప్రస్తుతము అనవసరము.
—తామ శీఘ్రిమే దయచెయ్యండి— సౌందర్య రస తరంగిణీ! ఉషాసుందరీ! రా!

మామిడితోపులో పొదలమాటున పేశలపుష్పవాటికన్
ఆమని లేతవెన్నెలలయందు ఒయారము లొల్కబోయుచున్
కోమలి చేరరమ్ము జడకుచ్చులు పయ్యెదపై నటింపగా
ప్రేమ రసామృతమ్ము కురియింపుము నీ చిరునవ్వు చిందులన్।

బౌద్ధ :- రాజనందనా! భోగలాలసత్వముచే మహాసామ్రాజ్యములు అంతరించినవి. యమము, నియమము, శాంతి, దాంతి, బ్రహ్మచర్యము లోకకల్యాణోదర్కములు. ఈనాడు నాహితభోధను పెడచెవిని పెట్టుచున్నావు. కాని ఒకనాడు నా ప్రబోధము నీకు అత్యవసరము కాగలదు.

ప్రేయసి కన్నుదోయి కనిపించుచు మోహము గప్పుచున్న ఈ
తీయని స్వర్గసౌఖ్యము గతించును; ఈ ధరణిన్ దరిద్ర నా
రాయణులెందరో కుమిలి అల్లలలాడుచు నున్నవారు; ప్రే
మాయతదృష్టి దీనజనులందర గావుము రాజనందనా !

యువ :- వ్యర్థ సన్యాసీ! నీ అలీకవాదాలను ఉపసంహరించు.
—ఉషాసుందరీ !

కామము దోషమంచు కలికాలము నేటికివచ్చెనంచు ఏ
మేమొ వచించుచుండెదరు వృద్ధులు నోటికివచ్చినట్లు, మా
యామయమైన యీప్రకృతియంతయు, పూచినపూలతో గృహా
రామ లతా నికుంజములు రమ్మనుచున్నవి లెమ్ము నెచ్చెలీ !

ఉష :- రాజనందనా ! మహర్షులను తిరస్కరించుట పాపం. ఈ సన్యాసినిని సత్కరించి పంపించివేదాం. లోపలికివెళ్ళి పూజాద్రవ్యములు తీసికొనివస్తాను.

బౌద్ధ :- సోదరీ ! నేను అతిథి సత్కారాలను వాంఛింపను— యువరాజు సందర్శనం కోసం నిరీక్షించి ఈ అవకాశమును వినియోగించుకున్నాను. కుమార చక్రవర్తీ !

ఆకలిమంటచే ఆరకమండెడి
ఆర్తనాదమ్ముల నందుకొనుము
కటికి కసాయి వాల్గత్తియెదుట
విలపించుగొర్రెను విడిపించుకొనుము
యజ్ఞవేదిక కోయునట్టి జంతుతతిని
హృదయమ్ముపై గుదియించుకొనుము

సంగ్రామరంగాల చావకమిగిలిన
జీవత్ శవాల వీక్షించుకొనుము
బుద్ధదేవుని దివ్యప్రబోధములను
ఓదలన్ దాల్చి భక్తితో అరసికొనుము
జీవకారుణ్య దివ్యసంసిద్ధితోడ
ఈ భువిని స్వర్గసీమగావింపుమయ్యా!

యువ :- బౌద్ధసన్యాసీ! సర్వసంగ పరిత్యాగులై ముక్కుమూసికొను మీబోటి సన్యాసులకు ఈ వేదాంతము చెల్లునుగాని రాజ్యతంత్రమును శాసించుచు దుష్టశిక్షణము శిష్టరక్షణము చేయవలసిన రాజులకు ఈ సిద్ధాంతాలు ఆచరణసాధ్యాలు కావు. నీ శుష్కవేదాంతం కట్టిపెట్టి వెంటనే ఇచ్చటనుండి వెళ్ళిపొమ్ము. ఇది నా ఆజ్ఞ.

బౌద్ధ :- బుద్ధం శరణం గచ్ఛామి—

(నిష్క్రమించును.)

(తెర)



# ధర్మచక్రం



## తృతీయ రంగము

[స్థలం : పాటలీపుత్రం; ధర్మస్థానం. ధర్మాసనాసీనుడైన మహాసేన సేనాని.]

మేఘువాహనుడు: గండోదరమిశ్రుడు దండుకేశ్వరమిత్రుడు కలిసి ఆషాఢశుద్ధ దశమినాడు సాయం సంధ్యాకాలంలో తామ్రపర్ణికి వెళ్లే ఓడలోని వర్తకులను దోచుకొన్నారు. ఆధనం-వరహాలు వజ్రాలు పూటకూళ్ల పెద్దమ్మ ఇంట్లో దొరికినాయి. శ్రీ చాణుక్యమంత్రి ఆజ్ఞానుసారం వీరిని ధర్మమూర్తి ఎదుటకు తీసికొనివచ్చాము.

మహా:-గండోదరమిశ్రా!

గం:- కొంచెం గట్టిగా చెప్పండి.

మహా:- విన్నావుకదా ? మీమీాది అభియోగం. ఆషాఢ శుద్ధ దశమి...

గం:- ఓహో! ఆఁ మా పొలంలో ఈయేడు వేరుశెనగ వేశాము.

మహా:-ఆషాఢశుద్ధ దశమినాడు ఓడలో...

గం:- ఓహో! మగధరాజ్యంలో ఓడలు ఆషాఢశుద్ధ అష్టమినుంచి కార్తీక పౌర్ణమివరకు బయలుదేరుతాయి.

మహా:- టాట్! ఈ మాటవిను. పూటకూళ్ళ పెద్దమ్మకిచ్చిన వజ్రాలు ముత్యాలు నీకెక్కడనుండి వచ్చాయి?

గం:-ఓహో—వజ్రాలు ముత్యాలు ఎన్నివిధాలనా? మీ ప్రశ్న-తామ్రపర్ణికము, పాండ్యకవాటకము, పాశిక్యము, కౌలేయము, చౌర్లేయము, మాహేంద్రము, కార్దమికము, స్రౌతసీయము, హ్రాదీయము, హైమవతము—ఇవి ముత్యాలలోని భేదాలు.

మహా:—చెవిటిగోలవలె ఉన్నదే!

గం:— విమలక, సస్యక, అంజనమూలక, పిత్తక, సులభక, లోహితక, అమృతాంశుక, జ్యోతీరసక, మాలేయక, అహిచ్ఛత్రిక, కూర్పప్రతికూర్ప, సుగంధికూర్ప, శిలాప్రవాలక ఇవి మణిభేదాలు.

మహా:— మేఘవాహనా వీడికి ఘోరమైన చెవుడువున్నది. నేను అరవలేను. నీవు గట్టిగా చెప్పు.

మేఘ:— ధర్మమూర్తి! గండోదరుడికి ఉత్త దొంగచెవుడు. ఇతడు ఈ వజ్రభేదాలను మీ దగ్గర వల్లించడం ఆ వజ్రాలు తన సొంతం అని నిరూపించటానికే.

గం:— ధర్మమూర్తీ! నాకు చెవుడువున్నది.

మేఘ:— జ్ఞాపకంలేదా ఒకసారి మీ ఇంటివద్ద మీతో మాట్లాడినాడు.

మహా:— ఆఁ జ్ఞాపకమున్నది.

—గండోదరా! నీది దొంగచెవుడు కాకపోతే యింతవరకు నేనువేసిన ప్రశ్నలు వినిపించకుండా మేఘవాహనుడు 'దొంగ చెవుడు' అన్నమాట ఎట్లావినిపించింది?

గం:— నాకు కుడిచెవికి మాత్రమే చెవుడు. ఎడమచెవికి లేదు. మీరు కుడివైపునుంచి ప్రశ్నలు వేస్తున్నారు. మేఘవాహనుడు ఎడమవైపునుంచి నాది దొంగచెవుడని చెప్పాడు. అందుచే అది వినపడింది.

మహా:— ఇది న్యాయస్థానం. ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పు? నీ పేరు.

గం:— ఎవరిపేరు వారు చెప్పుకోకూడదు.

మహా:— ప్రజలు నిన్ను ఏమని పిలుస్తారు?

గం:— అనేక విధాలుగా పిలుస్తారు. మా అమ్మ 'నాన్నా చిట్టి తండ్రీ! పొట్టిపాపాయి' అని పిలుస్తుంది. మాతండ్రి కేశ్వర

మిత్రుడు శ్రీ శ్రీ శ్రీ సేనాని గండోదరమిశ్ర మహామండలేశ్వరా! అని పిలుస్తాడు. మా తమ్ముడు యువరాజు 'ప్రాణమిత్రమా! ప్రియవయస్యా' అని సంబోధిస్తాడు.

మహా:- చాలు! నీ వృత్తి.

గం:- మొదటి యుద్ధానికి పూర్వం ఓడ వర్తకం చేస్తూవుండేవాడిని. కళింగదేశంనుండి ఏనుగులను మగధకు తెచ్చేవాణ్ణి. యుద్ధంలో ఏనుగులు చచ్చిపోయాయి. రెండవ యుద్ధానికి పూర్వం...

మహా:- చాలు అధిక ప్రసంగం మాను. ఇప్పుడు ఏమి చేస్తున్నావు? సూటిగా సమాధానం చెప్పు.

గం:- ఇప్పుడు ఏమి చేస్తున్నానా! మీ యెదుటనిలబడి మాట్లాడుతున్నాను.

మహా:- బాగుంది—ఇక్కడనుంచి వెడితే ఏం చేస్తావు?

గం:- ఏం చేస్తానా! ప్రస్తుతం యువరాజుకు అర్థశాస్త్రం బోధిస్తాను. తరువాత యువరాజు చక్రవర్తికాగానే ప్రధానమంత్రిగా మగధరాజ్యం శాసిస్తాను—యువరాజు నా ప్రాణమిత్రుడు.

దం:- నేను యువరాజుగారికి రెండవ మిత్రుణ్ణి—గండోదరుడికి మొదటి మిత్రుణ్ణి.

మహా:- ఛీ! నోరు మూయండి!

అగ్ని దేవుడికి మిత్రులమని పొగ ఆకాశంతోను, బూడిద భూమితోను కోతలు కోస్తాయి.

ఆషాఢశుద్ధ అష్టమినాడు నీవు నీ మిత్రుడు దండకేశ్వరుడు కలిసి తామ్రపర్ణి వర్తకుల ఓడలో ముత్యాలు వజ్రాలు అపహరించినారు. ఏమంటావు?

గం:- శుద్ధఅబద్ధం!

మహా:- వీరగుప్తుడు, ధర్మపాలుడు—ఇద్దరు భటులు మీరు ఆ వర్తకులను నదిలోనికి తోసివెయ్యటం—చూచారా ధర్మపాలా!

ధర్మపాలుడు:-(ప్రవేశించి) చిత్తం! ధర్మమూర్తీ! నేను, వీరగుప్తుడు వీళ్లు వర్తకులను తోసెయ్యటం చూశాము.

గం:- ధర్మమూర్తీ! చూడనివాళ్ల చేత ఇరవైమందిచేత చెప్పిస్తాను కావాలంటే.

మహా:- న్యాయస్థానంలో చూడటమే ప్రమాణం. చూడనివాళ్లు వెయ్యిమంది, విన్నవాళ్లు పదివేలమంది ఉంటేమటుకు ప్రయోజనం ఏముంది? వినికిడి నిష్ప్రయోజనం.

గం:- (నవ్వి) దండూ! మొండిలాగ మాట్లాడవేమిరా! ఒక్క నాలుగు ఘడియలు కాలక్షేపం చెయ్యి. (కన్నుగీటుతాడు)

మహా:- గండోదరా! ఇది న్యాయస్థానం. మహాసేనుడు ధర్మమూర్తి. ఏమిటా వెకిలినవ్వు — దండోదరుడితో ఏమిటి మాట్లాడుతున్నావు?

గం:- నేను! నవ్వేనా! అబ్బెబ్బె—మీరు చూశారా?

మహా - నాకు వినిపించింది—నాకు చెవుడనుకున్నావా?

గం:- అబ్బె! వినికిడి నిష్ప్రయోజనం—ఇది న్యాయస్థానం. ఇక్కడ చూడటమే ప్రమాణం.

మహా:- సరే! నవ్వేదుగాని, నీవు పూటకూళ్లమ్మకు ఇచ్చిన ముత్యాలు అన్నీ తామ్రపర్ణికాలు. నీమీద నేరం ఋజువయింది.

దండు:- ధర్మమూర్తీ! నేనేమీ ఎరగను.

[యువరాజు ప్రవేశం]

మహా:- శ్రీ శ్రీ శ్రీ మగధసామ్రాజ్య సార్వభౌమపుత్ర బిందుసార రాజకుమార చంద్రునకు స్వాగతం. ఈ ఆసనము అలంకరింప ప్రార్థన.

గం:- బిందూ! యువరాజా! తమ్ముడూ! కథ మంచి రసగంధాయంలో ఉండగా వచ్చావు. సుహృదభినందనాలు. ఏదో మొండిపట్టుపట్టి ఇంతవరకూ ఆపాను, కాలక్షేపంచేసి. లేకపోతే

ఈ పాటికి నన్ను ఎక్కడికో పంపించియుండేవారు. చూడు—సింహం బోనులో చిక్కుకొని పోయిందోయి.

యువ:- భయంలేదు—గర్జించకు.

గం:- బిందూ! నీ కోసం క్షణం ఒక యుగంగా సమాధానాలు చెప్పాను. బిందూ! నీవు చక్రవర్తివి కాగానే మొట్టమొదట నీవు చెయ్యవలసిన కార్యం ఈన్యాయస్థానాలకు స్వస్తిచెప్పటం. ఈ న్యాయస్థానాల మూలాన ప్రజలంతా పేచీకోరులై పోతున్నారు.

మహా:- రాజకుమారుని ఆగమన ప్రయోజనాన్ని ధర్మమూర్తి అర్థింపవచ్చునా?

యువ:- ధర్మమూర్తీ! గండోదరమిఃశ్రుని, దండు కేశ్వరుని విడిపించుకొని వెళ్లటానికి వచ్చాను.

మహా:- వీళ్ళిద్దరు తామ్రపర్ణి వర్తకుల ఓడను దోచుకున్నారు. వీరు నిందితులు. వదలటానికి వీలులేదు. ఇది చాణుక్యమంత్రి శాసనం. ధర్మశాస్త్రాదేశం.

యువ:- చాణుక్యమంత్రి శాసనం చంద్రగుప్త చక్రవర్తి కుమారునకు కూడా అన్వయిస్తుందా? ధర్మమూర్తీ!

మహా:- చాణుక్యమంత్రి శాసనం వర్తింపకపోతే, ధర్మశాస్త్రాదేశం చక్రవర్తి కుమారునికీ చక్రవర్తికీ కూడా వర్తిస్తుంది.

యువ:- ధర్మమూర్తీ! నేను వీరి విడుదలను అర్థిస్తున్నాను. వీరు నా మిత్రులు.

మహా:- మిత్రులా! రాజనందనా! వీరు నీ మిత్రులా! భావిభారత సామ్రాజ్య చక్రవర్తికి దారిదొంగలు త్రాగుబోతులు మిత్రులా? మగధసామ్రాజ్యస్థితి మా కండ్లఎదుట నేవిధంగా పరిణమించినది! చంద్రగుప్త చక్రవర్తి మగధసామ్రాజ్యాన్ని స్థాపించిన లోకైకవీరుడు. పెద్దపులి కడుపున పిల్లికూన పుట్టినదా? రాజనందనా! తండ్రిని మించిన పుత్రుడని పేరుగడించాలి కాని, యీ తాగుబోతులా నీ మిత్రులు!

యువ:- ధర్మమూర్తీ! నా మిత్రులను వెంటనే వదలిపెట్టాలి. ఇది నా కోరిక.

మహా:- రాజనందనా! నీ కోరికను మన్నించలేనందుకు మహా సేనుడు విచారించుచున్నాడు. మగధసామ్రాజ్యమునకు, వర్త కమునకు దేశ దేశాలనుండి ద్వీపద్వీపాంతరాలనుండి వర్తకులు వస్తున్నారు. నిందితులైన వీరిని విడిచిపెట్టడం సామ్రాజ్య గౌరవానికి కళంకం. ధనమును పోగొట్టుకొనిన వర్తకులగతి ఏమికావాలి? ధర్మపాలా!

ధర్మ:- చిత్తం.

మహా:- ఆ వర్తకులను ఇట్లా తీసికొనిరా!— (ధర్మ: నిష్క్రమి)

యువ:- ఆ విషయాలన్నీ చూచుకొనేభారం నాది. వీరిని బంధ ముక్తులను చెయ్యాలి!

ధర్మ:- (ప్రవేశించి) ఆ వర్తకులకు వారి ముత్యాలు వజ్రాలు యువరాజుగారు ఇచ్చివేశారుట. వారు న్యాయస్థానం వదలి వెళ్లిపోయారు.

మహా:- సంతోషము. వర్తకుల సొమ్ము వర్తకులకు ముట్టినది.

యువ:- అయిన వీరిని విడిచిపెట్టవలెను.

మహా:- వీలులేదు— శాస్త్రస్మృతిని అనుసరించి వీరికి దండన విధించాలి!

యువ:- ధర్మమూర్తీ! వీరిని వెంటనే విడిచిపెట్టాలి. ఇది నా ఆజ్ఞ.

మహా:- రాజనందనా! నాకు చంద్రగుప్త చక్రవర్తి ఈ 'రక్త పాశము' బహూకరించినారు. ఈ కత్తి నా చేదండ వున్నంత వరకు నేను రాజప్రతినిధిని. నీకు చక్రవర్తిని ఆజ్ఞాపించు అధి కారములేదు.

—నీ ఆజ్ఞను నేను పరిపాలించిన మరుక్షణం మగధసామ్రాజ్య చక్రవర్తిత్వం నశిస్తుంది. నీవు నశిస్తావు. నేను నశిస్తాను.

అప్పుడు శూన్యం మగధసామ్రాజ్యాన్ని ఏలుకొంటుంది. రాజ నందనా! నన్ను అనుశాసించేందుకు పూర్వం ఈరక్తహాసాన్ని పరిగ్రహించు. కాని ఈ రక్తహాసమును అందించేందుకు ముందు నా విధ్యుక్తధర్మాన్ని నెరవేరుస్తున్నాను. గండోదరా! దండుకేశ్వరా! మీ యిద్దరకు చెరియొక వంద వరహాలు అపరాధం, ౧౫ దినములు కారాగారవాసం విధిస్తున్నాను. రాజనందనా! ఇదిగో రక్తహాసం.

యువ:- ధర్మమూర్తీ! నీవు మగధసామ్రాజ్య సాధనిర్మాతవైన ఉత్తమ మహాశిల్పివని చంద్రగుప్త సార్వభౌముడు బహూకరించిన రక్తహాసమును పరిగ్రహించటానికి రాజపుత్రుడు కృతఘ్నుడా?

గండు:- బిందూ! బిందూ! నన్ను ఈ కిరాతుల చేతులలో వదలి వెళ్ళిపోతున్నావా! నిన్ను వదలి ౧౫ దినములు కారాగారంలో వుండటమే!

యువ:- గండోదరా! విచారింపకు, చాణుక్యమంత్రితో నివేదించి మిమ్మల్ని విడిపించటానికి ప్రయత్నిస్తాను.

గం:- యువరాజా! నేను—నా కోసం విచారించటంలేదు. నేను చిన్న కారాగారంలో ఉంటే నీవు అంతకంటె పెద్ద కారాగారంలో ఉన్నావు.

—కాబోయే చక్రవర్తివి! నీకు ఈ మాత్రం స్వేచ్ఛలేదే! ఇప్పుడే ఈలాచేశావే! నీవే చక్రవర్తివైతే ఏమిచేస్తావో.

—నేనే బిందుసారుణ్ణి అయితే ఈ ధర్మమూర్తి తలకాయ సప్తసముద్రాలకు అవతల ఉండేది ఈ పాటికి.

యువ:- కాదు గండోదరా! పొరపడుతున్నావు— నేనే గండోదరుడిని ఐతే అట్లా చేసేవాడిని. నేను రాజపుత్రుణ్ణి— యువరాజుగూడ న్యాయసూత్రాలను అతిక్రమింపకుండా కాపాడే

ధర్మమూర్తులు మగధసామ్రాజ్యంలో ఉన్నందుకు నేను గర్విస్తున్నాను. నిన్ను నన్ను ఈ రాజ్యాన్ని సమస్తభూమండలాన్ని ఒక పవిత్రధర్మం నడుపుతోంది. ధర్మమూర్తీ! ఇదుగో రెండువందల వరహాలు. మహాసేన మహామండలేశ్వరా! క్షమించు! ఇకమీద నేను చంద్రగుప్త చక్రవర్తికి తగిన పుత్రుణ్ణి అని అనిపించుకుంటాను.

(నిష్క్రమించును)

గం:- బిందూ! బిందూ!

మహా:- అరవకు! యువరాజు వెళ్ళిపోయాడు.

గం:- బిందూ! నిన్ను నన్ను ఈ రాజ్యాన్ని సమస్త భూమండలాన్ని ఒక పవిత్రధర్మంకాదు—పొరపడుతున్నావు—నడిపేది చాణుక్యుని అదృశ్యహస్తం.

మహా:- ధర్మపాలా! వీరిని కారాగారంలో బంధించి చాణుక్య మంత్రికి నివేదించు.

(— తెర —)



# ధర్మచక్రం



## చతుర్థరంగము

[ స్థలం :— పాటలీపుర నగరద్వార సమీపమున. ]

వజ్రబాహు:- రండోయి యీ కల్లు రుచిచూచి పొండోయి
వీరదాసు:- ఉండాది యీ కుండలో కల్లు నిండాను.
ఇరువురు:- దయ్యానిని గుక్కెడు గుటుక్కుమనని స్తే
దేవలోకాలన్ని దిగమింగివస్తుంది
పొట్టగోసితే ఒక అచ్చరములేనట్టి
బండవాడికి కల్లు పడలీసిపోస్తేను
కతలల్లి చెపుతాడు కావ్యాలు రాత్తాడు॥
గండోదరమిత్రుడు:- ఉండాలిరా దండు.
దండుకేశ్వరమిత్రుడు:- ఉండాలిరా గండు ఉ॥
ఇరువురు:-

ఆలమందకు దొడ్డి
అప్పులాడికి వడ్డి
దున్నపోతుకు గడ్డి
చాకలాడికి నడ్డి—ఉండాలి॥
యుద్ధానికి కత్తి
దీపానికి వత్తి
కంసాలికి సుత్తి
దేహానికి నెత్తి—ఉండాలి।
సేవకులకు భక్తి
కావ్యాల కనుకక్తి

భర్తలకు శక్తి
యోగులకును ముక్తి—ఉండాలి
ఊరగాయకు ఉప్పు
బాపనయ్యకు పప్పు
ఆడదానికి కొప్పు
పాడటానికి చెప్పు—ఉండాలి॥
ఉండటానికి ఇల్లు
తాగటానికి కల్లు
చూడటానికి కళ్లు
నమలటానికి పళ్లు—ఉండాలి॥

వజ్రబాహు:- ఎవరోరు వచ్చారు ఎవరోరు వచ్చారు.
వీరదాసరి:- దేవతలో మీరిపుడు దెయ్యాలో సెప్పండి.
గం:- కల్లుకుండ చూస్తే మా గండుగాడికి వొళ్లు ఝల్ ఝల్లు
మనిపిస్తుంది.
వజ్ర:- ఎవరోరు వచ్చారు ఎవరోరు వచ్చారు
దేవతలో మీరిపుడు దెయ్యాలో సెప్పండి.
దం:- వీడెచట పుట్టాడో నేనెచట పుట్టానో
నేనెచట పుట్టానో వీడెచట పుట్టాడో
సముద్రములో ఉప్పు అరణ్యములో ఉసిరి
ఊరగాయైనట్లు ఒక్కటైపోయాము ॥వీడెచట॥
వీరదాసరి:- ఎవరోరు వచ్చారు ఎవరోరు వచ్చారు
దేవతలో మీరిపుడు దెయ్యాలో సెప్పండి.
గం:- నేను ద్రౌపది మీసాలపైన చిన్ని
పుట్టుమచ్చనై ఒకనాడు పుట్టినాను
మగధసామ్రాజ్యమందున మంత్రినాచు
ఏలుకొందును మిమ్ముల నింక మీద!
దం:- నేను అంజనేయుని తోకపైన చివరి

వెంట్రుకందు గోమారుగ వెలసినాను
రాక్షసుల తోకతో చుట్టి రాసినపుడు
గట్టిగా శత్రుకోటిని కరచినాను.

వజ్ర:- ఒరేయి! దాసూ! ఈరు దేవతలే! అమృతం తాగే వచ్చారురా!

దం:- గరిశెడు కల్లు కడుపులో చేరితే, సప్తసముద్రాలుచేరి ఘోషిస్తూ వున్నట్లుంటుంది.

గం:- ఒరే! మేం దేవతలం. విను—మేమే దెయ్యాలమయితే మీరు ఈ పాటికి నాలుగామడలు కాళ్లకు బుద్ధిచెప్పేవారు.

వీర:- మాకేటిభయం. ఎప్పుడూ వల్లకాటిలో కాపలా కాసే వోళ్లకి—మాకేటిభయం.

దం:- అరే! దాసరీ! మీరు శ్మశానంలో కాపలాకాస్తారుగదా ఎప్పుడైనా దెయ్యాలు కన్పించాయిరా!

వీర:- రాత్రిళ్లు కన్పిస్తూవుంటాయి.

దం:- ఎప్పుడైనా వాటిని పలుకరించావురా!

వీర:- లేదు.

దం:- పోనీ, అవెప్పుడూ నిన్ను పలుకరించలేదురా?

వీర:- దెయ్యాలు అందరితోనూ మాట్లాడవు.

గం:- ఒరే! వీరదాసరీ! ఒక్క పదిదెయ్యాలను మచ్చికచేసి నాకు అప్పగించరా! ఈవ టలీపుత్రాన్ని ఒక్కసారి ఊపేస్తాను.

వీర:- ఏమోనండి నేను ఎప్పుడూ ఒక దెయ్యంతో నైనా మాట్లాడలేదు. మా తాతకు ఒక పెంపుడు దెయ్యం ఉండేదిట. మా ముసలమ్మవ్వ సెపుతుంది. ఆ దెయ్యం కూడు గట్రా తీసికొని ఎళ్లి మా తాతకు ఇచ్చేదిట. నా సిన్నప్పుడు ఆ దెయ్యం పిల్లలతో ఆడుకున్నానంట.

దం:- ఒరే! దాసరీ 'ట' అంటావేమిటిరా! నీవు ఎప్పుడూ ఒక సారిగూడ చూడలేదా?

వీర:- సూడకేం రాత్రిళ్లు శవాలు కాలుతూవుంటే వచ్చి సుట్ట

కాల్చుకొని పోతూవుంటాయి. నిన్న రాతిరికూడా తొంగున్న
ప్పుడు సూశాను.

వజ్రి:- ఒరేయి దాసూ! నిన్న రాతిరి కాలుతూవున్న సితిలో
సుట్ట కాల్చుకొన్నది నేనేరోయి.

వీర:- అది కాదురా! నేను లచ్చసారులు సూశాను. కూకో.

గం:- ఒరే! వీరదాసరి! ఒక్కదయ్యాన్ని సంపాదించరా! మహా
సేనుడుమీద ప్రయోగించాలి.

దం:- గండూ! పాపం మహాసేనుడు ఏమిచేశాడురా?

గం:- ఒరే దండూ! వాడు బహిరంగ న్యాయస్థానంలో యువ
రాజును తిట్టి వదలిపెట్టాడు. పాపం! బిందు మొగం వాడి
పోయింది. అరే! ఆ క్షణంనుండి యువరాజు మనస్సు మారి
పోయిందిరా!

దం:- యువరాజు మనస్సు మారిపోయిందిరా!

గం:- నిన్న యువరాజును ప్రేమతో బిందూ బిందూ అని పలుక
రిస్తే 'ఛీ' నోరుమూసుకోమన్నాడు. ఇదేమిటిరా కాల
చక్రం గిఱ్ఱుగిఱ్ఱున అడ్డదిడ్డంగా తిరుగుతోంది.

కాలము మారిపోయినది కంచరిగాడిద చక్రవర్తి గు
ఱ్ఱాలకు సార్వభౌముడయి రాజ్యముచేయుచు నున్నవాడు
దీపాలను ఆర్పుచున్న వెధవాయియె బల్ మొనగాడు నేడు
మార్జాలము వ్యాఘ్రరాజమొక జాతికి చేరెను దండుకేశ్వరా!

చంద్రగుప్తుడు కాదురా రాజ్యంచేసేది. చాణుక్యుడు, మహాసేనుడు యువరాజు నోరుమూసేశారు.

దం:- రా పోదాం, వూళ్లోకి.

వజ్రి:- ఎక్కడికండోహో! ఆగండి. ఇది అర్ధరాతిరి. ఇప్పుడు
పాటలీపుత్రంలోకి ఎవరూ పోకుండా సూచేందుకే కావలా
మేము- తెలిసిందా?

గం:- మేము వెళ్లాలి. వెళ్లితీరాలి. ఈ అర్ధరాత్రి వూళ్లోకి వెళ్ల
కుండా ఇక్కడ ఏం చెయ్యమంటావు?

వజ్రి:- ఇది రాజుగోరిఅగ్గె. ఇక్కడ కునికిపాట్లుపడుతూ కూర్చోని రాంభజన సెయ్యండి. కదలటానికి ఈల్లేదు. ఇదిగో కత్తి సిద్దం సూడు.

దం:- రామభజన సలుపరా రఘురామభజన సలుపరా ?

గం:- ఎందుకురా దేవుణ్ణి స్మరిస్తావు. ఇది అర్ధరాత్రి. ఆ మహానుభావుడు వైకుంఠంలో పాలసముద్రం మధ్య లక్ష్మీదేవితో కలసి మంచి ఒకటోరకమైన గుఱ్ఱుకొడుతూ నిద్రపోతూవుంటాడు.

— ♦ బౌద్ధసన్యాసి ప్రవేశం ♦ —

బౌద్ధ:- బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి.

వజ్రి:- దండాలండి బాబయ్యా, దండాలండి.

గం:- ఒరేదండూ! ఈ సన్యాసి నిశాచరుడు.

బౌ:- వజ్రిబాహూ ! వీరదాసరీ!— ఏమిటి ఈ అర్ధరాత్రి మీరు ఇక్కడ ఉన్నారు

వజ్రి:- ఈ రాతిరి కాపలా మావంతు వచ్చింది.

దం:- నీవెందుకు వచ్చావు సన్యాసీ !

బౌ:- పూర్వ జాతక కథలుచెప్పి నా ఆశ్రమానికి వెళ్తున్నాను.

దం.- వీరదాసరీ!— అయితే యీసన్యాసిని ఎందుకు పోనిస్తున్నావు?

వజ్రి:- సాములోరు పాటలీపుత్రంలోనుంచి బయటకు ఎళ్లుతున్నారు. ఎళ్లిపొయ్యేవోళ్ళను ఆపం.

గం:- ఒరే! సన్యాసీ! ఆగు! ఒరే దాసరి! వీడికి దండాలెందుకు పెట్టావు ?

వీర:- ఊరు మా ముండోడికి సలసల కాగే జెరంవస్తే మందిస్తే తగ్గిపోయింది— మీరు ఇన్నారా ! సక్కని యెన్నపూసలాంటి కతలు సెపుతారు.

గం:- నీకు దేవుణ్ణిగురించి ఏమైనా తెలుసునా సన్యాసీ ?

బౌద్ధ:- తెలియదు.

గం.- అయితే నీవు బోధించే విషయాలేమిటంట!

బౌద్ధ:- నాయనా! నీవు అడ్డదిడ్డంగా అడుగుతున్నావు. ఈ జీవితం క్షణభంగురం, నీటి బుడగవంటిది. దీనజనుల సేవచేసి తరించు. తుచ్ఛసుఖాలకై పాకులాడవద్దు.

గం:- జీవితం నీటిబుడగ—ఈ అమ్మమ్మ వేదాంతం చాలామంది చెప్పేశారు. మేము వినేశాం ఇవరకే—జీవితం క్షణభంగురం అయితే ఆ క్షణంలోనే ఎందుకు సౌఖ్యాలను అనుభవించకూడదంట!

దం:- ఒరే గండూ! బలేప్రశ్న వేశావురా!

బౌద్ధ:- ఛీ! మీరు కల్లుతాగి ప్రేలుతున్నారు. మీతో వాదం ఏమిటి?

గం:- సన్యాసీ! నీ వెప్పుడైనా ఒక పురిసెడు కల్లు రుచిచూశావా? రుచిమరిగితే మళ్ళా వదిలిపెడతావా? మేమేకాదు—నీ శిష్యులు ఈ వజ్రబాహు, దాసరి, వీళ్ళుమాత్రం—

బౌ:- వజ్రబాహూ! వీరదాసరీ! కల్లు తాగవద్దని నేను చెప్పలేదూ? మళ్లీ తాగారా!

వజ్ర:- బాబయ్యా! ఈ వేళ ఒక్కసారేనండి. ఈ వేళ మావంతు రాతిరల్లా మేలుకొని కాపలాకాయాలి. రేపటినుంచి శ్మశానంలో ఉంటాము.

బౌ:- ఈ వేళ స్నానం చేశారా!

వీర:- ఇద్దరం చేశామండి. బట్టలు నదిలో ఉతుక్కొని ఆరేసి కట్టుకున్నాము.

బౌ:- ఆ రక్తం మరకలేమిటి దాసరీ!

వీర:- దొంగోడికి చిచ్ఛ ఏసారండి. తల నరికేశాను.

బౌ:- అబ్బబ్బ జీవహింస!

వజ్ర:- అది రాజుగోరి అగ్గ! తప్పుతుందండీ!

బౌ:- బుద్ధం శరణం గచ్ఛామి! (నిష్క్రమిస్తాడు)

—• ౧వ పరదేశి ౨వ పరదేశి ప్రవేశం •—

వీర:- ఆగండోహో ! ఆగండి.

వజ్ర:- ఎవరోరు వచ్చారు ఎవరోరు వచ్చారు
దేవతలా మీరిపుడు దెయ్యాలా సెప్పండి.

౨వ పరదేశి:- మేం పరదేశులం. పాటలీపుత్రంలోకి పోవాలి
మమ్మల్ని లోపలికి పోనియ్యి.

గం:- ఏమండోయి మీ రెవరోగాని ఇటుచూడండి, ఇందాకటి
నుంచి మమ్మల్నిగూడ వీళ్లు లోపలికి పోనివ్వడంలేదు. వీళ్లు
ఇద్దరు, మనం మొత్తం నలుగురం. మీరు ఊఁ అంటే ఒక
పట్టుపట్టేద్దాం. ఏమంటారు—కాసుకుంటారా !

వజ్ర:- ఏమయ్యోయ్ ! ఇది ఏకాకోళం అనుకుంటున్నావేమిటి ?
ఊఁ అని ఈల వేస్తే ఉరికి ఇరవై వొందలమంది ఊడిపడతారు
జాగ్రత్త!

౨ పరదేశి:- గండోదరా! విన్నావా ? ఏంచేదాం?

దం:- ఒరే గండూ ! ఈ పరదేశికి నీ పేరు ఎట్లా తెలిసిందిరా.

గం:- అరే దండూ! మగధరాజ్యంలో మనకీర్తి తెలియనివాళ్ళెవ
రురా ! ఏమండీ పరదేశిగారూ ! ఇరవై వొందలమంది ఊడి
పడతారనా మీ భయం.

౨ పరదేశి:- ఒకవేళ ఊడిపడితే—ఏమవుతుంది ?

గం:- అప్పుడే ఊరుకుంటాము.

౧ పరదేశి:- బాగుంది ! వజ్రబాహూ ! మేము పరదేశులము,
కాస్త మమ్మల్ని పాటలీపుత్రంలోకి పోనియ్యి.

వజ్ర:- పరదేశుల్ని నమ్మమని లేదు.

వీర:- ఏమండోయి సాయంకాలం మా కల్లుపాకలో ఒకడు ఏం
సెప్పాడో తెలుసా. తెల్లోళ్ళు సింధునదిదగ్గర దండెత్తి రావ
టానికి సూత్తున్నారట. పరదేశులతో మొహమాటం ఏమిటి?

౧ పరదేశి:- దండెత్తి వస్తున్నారా ? ఆ విషయం నీవు చాణుక్య
మంత్రితో చెప్పావా ?

వీర:- ఓహో ! బాగుంది. మనం శాణుక్యులోరికి సెప్పాలా. శాణుక్యులోరికి ఎయ్యిమైళ్ళలో మాట్లాడుకునే విషయాలన్నీ వినిపిస్తాయి. ఇప్పుడు మనం మాట్లాడుకునేవి ఆయన వింటున్నాడనే నా వూహా.

౧ పరదేశి:- నీకు శావాలంటే— చూడు, మమ్మల్ని లోపలికి వెళ్లనియ్ !

వజ్రబాహు:- ఛీ ! ఆగండి (కత్తిదూసి)

వీరదాసరి:- ఇది రాజుగోరి ఆగ్న ? కదిలితే నరికేస్తాం.

వజ్రి:- ఆగండి ఇంక, సెందరగుప్తుడైనా శాణుక్యుడైనా ఆగాలిసిందే ! హరిహరమహదేవ్ !

౧ పరదేశి:- చంద్రగుప్తుడు, చాణుక్యుడే ఇక్కడ ఆగింది ! —(వేషంమార్చి) ఆగండి.

వీర:- బాబయ్యా దండాలండి బాబయ్యా ! మీ పాదాలకు దండాలండి. తెలియక చేశాం, చమించాలండి—మీరని తెలియదు.

వజ్రి:- దండాలండి బాబయ్యా ! దాసూ ! మనంచేసిన తప్పేముంది. రాజుగోరి ఆగ్గి—అన్నీ ఆరే శెలవివ్వాలి.

దం:- మహాప్రభువుగారికి నమస్కారాలు.

చాణు:- ఏం ఇట్లావచ్చారు అర్ధరాత్రి.

దం:- తమ ఆజ్ఞప్రకారం మమ్మల్ని చెరసాలనుండి వదలివేశామని చెప్పారు. అక్కడనుంచి వస్తూవుండగా ఇక్కడ వీళ్లు ఆపేశారు.

చా:- సరే ! వీళ్లను పాటలీపుత్రంలోకి పోనివ్వండి.

గం:- శ్రీ శ్రీ శ్రీ మహారాజరాజశ్రీ చంద్రగుప్త సార్వభౌములకు, చాణుక్య మంత్రివరేణ్యులకు నమస్కారాలు.

(నిష్క్రమిస్తారు)

చాణు:- వీరదాసరీ, వజ్రబాహూ ! మీ స్వామిభక్తికి పరమ సంతోషం. శ్రీ శ్రీ శ్రీ చంద్రగుప్త సార్వభౌములు మిక్కిలి సంతోషిస్తున్నారు.

వజ్రి, వీర:- దండాలండిబాబు దండాలండి.

చాణు:- ఇదిగో మీ స్వామిభక్తికి బహుమానంగా చక్రవర్తిగారి ఉంగరాలను ఇస్తున్నారు.

వజ్రి:- (కళ్లనద్దుకొని) సెందరగుప్త పెబువులోరికి జై !

వీర:- శాణుక్యులోరికి జై !

[—తెర—]



# ధర్మచక్రం

## పంచమ రంగము

స్థలం— పాటలీపుత్రం— సామ్రాజ్య పరిషత్తు.

వందిమాగధులు :- జై జై జై శ్రీ శ్రీ శ్రీ మగధసామ్రాజ్య సార్వభౌమ స్వతంత్రభారత నిర్మాణధామ! శ్రీ శ్రీ శ్రీ చంద్రగుప్త చక్రవర్తీ జై జై జై!

చంద్రగుప్తుడు:- (ప్రవేశించి) మహామంత్రీ! గ్రీకు సైన్యాలు సింధునదిని దాటుటకు ఇది రెండవసారి. మొదటిసారి విజయలక్ష్మి మగధ సేనాసమితిని వరించింది.

చాణుక్య:- మహాచక్రవర్తీ! యీసారికూడ విజయలక్ష్మి మగధ సామ్రాజ్యమునే వరిస్తుంది. గ్రీకులు సంధిసూత్రాలను అతిక్రమిస్తున్నారు. అప్రతిహతమైన మగధసేనాతరంగ పరంపరలు విశ్వప్రపంచమును క్షణమాత్రములో ముంచివేయగలవు.

చంద్ర:- మేఘవాహనా!

మేఘ:- మహాచక్రవర్తికి జయం. మేఘవాహనుడు వీరప్రణామము సమర్పించుచున్నాడు.

చంద్ర:- చిరంజీవి బిందుసారుడు ఇప్పుడు ఎక్కడ వున్నాడు?

మేఘ:- నిన్న సాయంకాలం శోణనదీతీరాన అశ్వికసైన్యాలకు శిక్షణ గరపి వెళ్ళినారు.

చాణు:- మేఘవాహనా! చక్రవర్తి ప్రశ్నకు సమాధానం చెప్పు- ఇప్పుడు—చిరంజీవి ఉనికిపట్టులు నీకు తెలియవా?

మేఘు:- శ్రీ బిందుసార రాజచంద్రుని ఉనికిపట్టులు ...

చంద్రి:- మేఘవాహనా ! నీ వేదన నాకు అర్థమయినది. నీ కంఠములోని గాద్గద్యం వెయ్యి గొంతుకలతో చిరంజీవి ఉనికిపట్టులను ఉద్ఘోషిస్తోంది.

వందిమాగధులు:- శ్రీ శ్రీ శ్రీ మహారాజరాజశ్రీ బిందుసారరాజచంద్రి ! జై జై జై!

బిందు:- పితృపాదులు మహాచక్రవర్తికి బిందుసారుని వీరప్రణామం.

చంద్ర:- వీరపురుషుడవై వర్ధిల్లు

బిందు:- మహాచక్రవర్తీ ! మీ కంఠములో గాద్గద్యం కంపిస్తోంది.

చంద్రి:- చిరంజీవీ ! ఇది నా జీవితంలో అపరసంధ్యాసమయం—సమర్థుడైన పుత్రుని భుజస్కంధాలమీద ఈ పాటికే రాజ్యభారమునునిలిపి తపస్సుచేసుకోవలసిన ఉత్తమ కర్తవ్యం విస్మరించినాను. నాకు వార్ధక్యం వచ్చింది.

బిందు:- చంద్రగుప్త చక్రవర్తికి వార్ధక్యంరాదు. వైక్లబ్యానికి కారణాంతరాలు లేవుగదా !

చంద్ర:- ఉన్నది. గ్రీకులు సింధునదినిదాటి దండెత్తి వస్తున్నారు.

బిందు:- మహాచక్రవర్తీ ! ఎవని బొమముడిపటునుగాంచి భరతఖండము తల్లడిల్లిపోతుందో— ఎవని పేరు గ్రీకు సేనాపరంపరలకు సింహస్వప్నమో, ఎవని దీర్ఘనిశ్వాసం వైరిసేనాబలాలకు ప్రళయ ఝంఝామారుతమో, ఎవని శంఖారావం వైరిదేశాలకు భూకంప ప్రకంపనమో, ఆ మహావీరుడు చంద్రగుప్త చక్రవర్తికి గ్రీకు దండయాత్రను గురించి గాద్గద్యం సంభవిస్తుందంటే లోకం విశ్వసింపదు.

చంద్రి:- నిజమే ! చక్రవర్తియే సేనాసమూహాలకు సర్వసేనాధిపతి. వీరపురుషుడైన చక్రవర్తి తన సేనలతో రణరంగంలో వీరస్వర్గం అలంకరించాలి. లేదా ఏకచ్ఛత్రాధిపతియై రాజ్యాన్ని ఏలుకోవాలి. ఇది చిరంజీవీ ! మన వంశమర్యాద. కాని—నేను ఈ ముసలితనంలో సేనలను నడపలేను. ఈ

భారం సమర్థుని భుజస్కంధాలమీద మోపెట్టవలసిన తరుణం ఆసన్నమైనది.

బిందు:- మహాచక్రవర్తీ ! మీ ఆజ్ఞను శిరసావహించి నేను సర్వ సైన్యాధిపతి ఆజ్ఞానుసారం గ్రీకులను ఎదిరించి సర్వస్వాన్ని అర్పిస్తాను. రణరంగంలో బిందుసారుడు తండ్రికి తగిన పుత్రుడనిపించుకోటమే నా ఏకలక్ష్యం.

చంద్ర:- తండ్రీ ! వర్తమానకాలానికీ, భూతకాలానికి నీ వాక్కులలో ఏమీ సంబంధం కనిపించటంలేదు.

బిందు:- భావికాలమే నా ప్రమాణవాక్యాలను నిరూపించగలదు.

చంద్ర:- మహామంత్రీ ! సర్వసేనాధిపతిని రాజసభ నిర్ణయించాలని నా ఆశయం.

చాణు:- మహాచక్రవర్తీ ! రాజప్రతినిధియై చిరంజీవి బిందుసారుడు సర్వసైన్యాధిపత్యం వహించాలని రాజసభ ఏకాభిప్రాయం.

చంద్ర:- చిరంజీవీ ! మగధసామ్రాజ్యం నీ లేత భుజాలమీద అపారభారము మోపెట్టుచున్నదోయి.

బిందు:- మహాచక్రవర్తీ ! చంద్రగుప్త సార్వభౌమునికి తగిన పుత్రుడనై వీరధర్మాన్ని ప్రతిష్ఠిస్తాను. ఖడ్గసాక్షిగా ప్రమాణం స్వీకరిస్తున్నాను.

చంద్ర:- చిరంజీవీ! వీరమర్యాదను పరిపాలించి దిగ్విజయపరంపరాభివృద్ధిగా దండయాత్ర సాగించుకొనిరమ్ము. నేటినుండి యువరాజుగా నిన్ను అభిషేకం చేస్తున్నాను. ఇదిగో ప్రాతినిధ్య ఖడ్గం.

బిందు:- రాజధర్మం—వీరమర్యాదా నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా పరిపాలిస్తాను. మహామంత్రీ ! నమస్కారాలు. ఇది మీ ఆశీర్వచన ప్రభావం.

చాణు:- చిరంజీవీ ! పెద్దపులి కడుపున పిల్లికూన పుట్టదు. కాని, వనవిహారంచేసే పెద్దపులి కాలకర్మ వైపరీత్యంచేత బోనులో

చిక్కిన లోకులు దానిని కుక్కపిల్లవలె చూస్తారు. నీవు మహావీరుడవు. విజయీభవ !

బిందు:- మహామంత్రీ—దండయాత్రకు శుభముహూర్తం ఎప్పుడు?

చాణు:- రేపు ప్రాతః సంధ్యాకాలంలో సూర్యోదయాది 10 ఘడియలకు. సర్వసేనాధిపతీ—ఇక మీద కార్యక్రమం అంతా నీ అధీనం—నీవే నేటినుండి రణరంగాన్ని శాసించే చక్రవర్తి ప్రతినిధివి. రాజపుత్రుడు ఖడ్గలతాంగిని ప్రేమించాలి. ఖడ్గమే వీరపురుషునికి సరి ధర్మపత్ని. వలపుకత్తె. మెరుపుతీగలవలె మిరుమిట్లుగొలిపే అసిధారారోచిస్సులనే వీరపురుషుడు ఆరాధించాలి.

చంద్రి:- సర్వసేనాధిపతీ ! నేటినుండి ఖడ్గమే నీ సహధర్మిణి.

చాణు:- జై మగధ సామ్రాజ్య సర్వసేనాధిపతికీ.

మేఘు:- జై బిందుసార రాజచంద్రునికీ.

బిందు:- మేఘువాహనా ! ఈ రాత్రి నేను సేనాశిబిరంలోనే విశ్రమిస్తాను. మన దండనాథులందరిని నా శిబిరానికి ఆహ్వానించు.

మేఘు:- మహాప్రసాదం.

బిందు:- మహాసేన మహాశయా ! ధర్మమూర్తీ ! మగధసామ్రాజ్య సర్వసేనాధిపతికిగాని, సేనలకుగాని నాలుగు విఘడియలు అంతరాయం కల్పించిన వ్యక్తికి శిరచ్ఛేదమే సద్యశ్శిక్ష—ఇది నా ప్రథమ శాసనం.

మహా:- మహాప్రసాదం.

బిందు:- ధర్మమూర్తీ ! ఈ శాసనాన్ని అసిధారావ్రతంగా పరిపాలించు. యుద్ధసమయంలో నాలుగు క్షణాలలో సంభవించే నష్టాన్ని 80 సంవత్సరాలలో కూడ కూడదీసికోలేము.

చాణుక్య:- ధర్మపాలా ! విజయధ్వజం ప్రతిష్ఠించు.

ధర్మ:- చిత్తం—(ధ్వజమును ప్రతిష్ఠించి)

(ధర్మ-బిందు)—

ప్రోగింపు జయభేరి సాగింపు రణయాత్ర॥ మ్రోగింపు॥
మేఘమండలమందు మెరపుతీగలవోలె
విచ్చుకత్తులుదీసి చొచ్చుకొనిపోవాలి॥ మ్రోగింపు॥



# ధ ర్మ చ క్రం



## ష ష్ఠ రం గ ము

[ స్థలం :— పాటలీపుత్రం. ఉషాదేవి హర్మ్యం. ]

గండోదరమిశ్రుడు:- ఉషాదేవి! ఉషాదేవి!

దండుకేశ్వరుడు:- (ప్రవేశం) గండోదరా! సుప్రభాతమ్.

గం:- ఒరే దండూ! ఓహో! మరచిపోయాను. శ్రీ శ్రీ శ్రీ మహాదండనాయక గండరగండ దండుకేశ్వరమిశ్ర సేనానిగారూ! రండి!

దండు:- ఆగు! గండూ! పరమరహస్యం నాకు ఇప్పుడే తెలిసింది— నాకూ యువరాజుకు తప్ప ఇంకెవరికీ తెలియదు.

గం:- ఏమిటోయి ఆపరమరహస్యం.

దం:- గ్రీకుసైన్యాలు సింధునదినిదాటి ఉజ్జయినివైపు కదలివస్తున్నాయి. తెలిసిందా ?

గం:- ఆ! తెలిసింది.

దం:- అసంభవం ! అప్పుడే నీకు ఎవరు చెప్పారు ?

గం:- ఇప్పుడే ! నీవే కాదురా చెప్పింది.

దం:- ఓరి—నే చెప్పితేనేగదా నీకు తెలిసింది ? యువరాజుతో కలిసి నేడే ప్రయాణం. సూర్యోదయాది 10 ఘడియలకు ప్రయాణలగ్నం.

గం:- దండూ నిన్నుచూస్తే నాకు జాలివేస్తున్నదిరా !

దం:- ఎందుకు ? నిజంగా నాకు ఎంత అదృష్టంపట్టింది ! ఒక సామాన్యసైనికుడుగా ధ్వజంపట్టేవాడిని. నేడు— యువ

రాజు దయవలన దండనాథుణ్ణి. నా జీవితంలో ఇంతకంటె అదృష్టం ఏముంటావలి? నాకు సేనానాయకుడుగా మరణించాలని కోరికవుండేది.

గం:- ఇప్పటికైనా ఆలోచించుకో! నన్నుచూడు— నేను భటులను సమీకరించే ఉద్యోగం కోరుకున్నాను. హాయిగ పాటలీపుత్రంలో వుంటాను. నీవు నాకు అగ్నిదేవుడికి వాయుదేవుడిలాగ తోడుపడతావనుకున్నానురా!

దం:- అయితే నీవుకూడ యుద్ధరంగానికిరా!

గం:- తెలివితక్కువ కుంక! యుద్ధానికివెళ్లి చావడానికా?— ఈ యుద్ధం వెఱ్ఱిపీనుగులు చచ్చిపోవటానికి, తెలివిగలవాళ్లు బాగుపడటానికి వచ్చింది. ఎందుకురా యుద్ధానికిపోయి చావటం—ఒక్కదుకాణంపెట్టు, ఈ యుద్ధకాలంలో ఎంతలాభం సంపాదింపవచ్చో!

దం:- ఎంతమంది భటులను చేర్చావు ఇంతవరకు? గండా!

గం:- యుద్ధంలో చాలామంది చేరుతున్నారు. కాని—కొంతమంది 'గండోదరమిశ్ర మహాశయా! నా భార్య 10 రోజులు కాలేదు కాపురానికివచ్చి, వదలిపెట్టు' మని ప్రార్థిస్తున్నారు. మరికొందరు నాకు ఒక్కడే కొడుకండి ఈ ఉంగరం ఉంచమనీ ఈ వందవరహాలు అనుగ్రహించమనీ నిర్బంధిస్తున్నారు.

దం:- నీచేతి ఉంగరాలు ఈ విధంగానే సంపాదించావా?

గం:- ఛీ! ఛీ! ఈ ఉంగరాలను మొన్నకాదు అటుమొన్న యువరాజు ఇచ్చినట్లు జ్ఞాపకం. అంతేరా? చూడు నిన్న ఒక చక్కనిచుక్క, ఒక నవ్యలావణ్యలహరి, మిస మిస లాడే మల్లెమొగ్గ— తన భర్తను యుద్ధానికి తీసికొనివెళ్లకపోతే కాసులపేరు— ఈ గాజులజతలు ఇస్తానంది. ఛీ! రాజకార్యం, ఏమాత్రం వీలు లేదని అతనిని సేనలో చేర్చాను. అన్నట్లు జ్ఞాపకం వచ్చింది—నందినిని చూశావురా?

దం:- మేఘవాహనుడు నందినిని నిన్నటినుండి ఓదారుస్తున్నాడు—వాడు అదృష్టవంతుడు.

గం:- వాడిమొహం అదృష్టం. తిరిగిరానీ! నువ్వుకూడా నాతో ఉండిపో! మనం చెప్పినట్లల్లా నందిని వినే ఉపాయం ఆలోచించివేశాను.

దం:- గండూ! నీవు ఎండమావులనుచూచి భ్రమిస్తున్నావు. నందిని మేఘవాహనుడిని తప్ప ఇతరులను కంటితో చూడదు.

గం:- దండూ! స్వానుభవంతో చెప్పతున్నావా ఏమి?

దం:- హనుమంతునిదగ్గరా కుప్పిగంతులు!

గం:- ఉషాదేవి! ఉషాదేవీ! నీ సిద్ధుర తగలెయ్య! యువరాజు వస్తున్నాడు—

ఉషా:- (ప్రవేశించి-) నిజమే?

:: యువరాజు ప్రవేశం ::

గం:- శ్రీ శ్రీ శ్రీ మగధ సామ్రాజ్యసార్వభౌముడికి ఆశీర్నమస్కారాలు.

దం:- సర్వసేనాధిపతీ! వీర ప్రణామం (సైనికోచితముగ)

యువ:- దండుకేశ్వర దండనాథా! దండయాత్రా ముహూర్త లగ్నము సమీపించుచున్నది. నా గుర్రమును తీసికొని రమ్మని మేఘవాహనునితో చెప్పు. ఇక్కడనుండే బయలుదేరుతాను.

( దం- నిష్క్రమించును )

—ఏం గండోదరా! ప్రయాణానికి అన్నీ సిద్ధంచేశావా?

గం:- ఆ, శకటాలు, అశ్వాలు, భటులు, రథాలు, ఏనుగులు, పల్లకీలు—గాజులు అన్నీ సిద్ధంగా వున్నాయి.

యువ:- గాజులెందుకు?

గం:- యుద్ధానికి వెళ్లనివాళ్లకు.

యువ:— బాగున్నది. నీ పూర్వవైఖరి మారాలి. ఇంకో అవతారం ఎత్తు. అప్రమత్తుడవై యుండాలి. చాణుక్యమంత్రి చండశాసనుడు సుమా ?

గం:— చాణుక్యమంత్రితో కలిసిపోయాంగదా ! యుద్ధం వచ్చిన దగ్గిరనుంచీ: ఇంకేమీ భయంలేదు బిందూ— విజయీభవ ! పోయివస్తాను.

యువ:— ఉషాదేవీ !

ఉషా:— ఆర్యపుత్రులకు స్వాగతం. బాలభానుని పసిడి కిరణాలు గవాక్షాలనుండి వంకర టింకరగా నా కన్నులమీద పడుతున్నాయి. ఇప్పుడే లేచినాను.

యువ:— ఉషాదేవీ !

లెమ్ము ! శుభోదయమ్ము, లవలీ
సుమముల్ నవసాంధ్యరాగముల్
చిమ్మె ప్రపంచమెల్ల, సరసీ
సలిలమ్ములవిచ్చు మొగ్గకెం
దమ్మినిజేరె ఝుంకరణ నాదముతో
నునువెచ్చ తేనెకై
తుమ్మెదరేడు; తూర్పుదెస
తోచెను బాలమరీచిమాలియున్.

ఉష:— ఆర్యపుత్రులు ఈ ప్రభాత సంధ్యాసమయంలో వసంతుని వలె విచ్చేసినారు.

యువ:— ప్రణయరసతరంగిణీ !—నా జీవితంలో నేడు ఒక మధుర ప్రభాతం వికసించింది. కలతనిద్దురలో కమ్మని కలలుకంటూ వున్న నన్ను గాంధర్వలోకంలోనుంచి ఉషాసుందరి రెక్కలు కట్టుకొనివచ్చి మేలుకొలుపుపాడి ముసి ముసి నవ్వులు కురిపించివేసినది.

ఉష:- ఈ ప్రపంచాన్ని, సకల ప్రాణికోటిని నిత్యచైతన్యంతో తాండవింపజేసే తేజోమూర్తి అవ్యాజప్రేమతో సహస్రరోచిస్సులతో నన్ను కౌగిలించుకొని నిద్రనుండి లేపినాడు. ఆ దివ్యస్పర్శకు పులకించి కన్నులు నలుపుకొనుచూ చూస్తున్నానుగాని ఆ జ్యోతిర్మయునికి అర్ఘ్యాంజలి సర్పించలేదు ప్రభూ !

యువ:- ప్రేమతపస్వినీ ! నీ చిరునవ్వు చిందులు నా స్వప్నాలకు రెక్కలుతొడిగి ఈ ప్రత్యూష పవనతరంగ డోలికలపై ఉయ్యాలలూగిస్తున్నవి.

సిగ్గులమొగ్గ ! చిన్నగవు చెక్కిలిపై కెంటాలవోలె లే
బుగ్గల సొట్టలన్ విరిగి పొంగులువారెడి స్వప్నపంక్తిలో
గగ్గురుపాటు వాల్గనుల కాటుక అంచులజార జాలువా
సిగ్గులు పైట చెంగుపయి నింపుము, మబ్బులమించుతీవవై.

ఉష:- ఈ మధుర ప్రభాతవేళ ఆకస్మికమైన మీ ఆగమనానికి ఏదో అంతరార్థం వుండాలి.

చల్లగాలులలోన మెల్లగ తలలెత్తె
పూర్వదిశకు ప్రొద్దుపొడుపు పూలు
కలకల నాదాలు చెలగి పిల్లలు మేలు
కొన్నవి పిచ్చుకగూళ్లలోన
ప్రత్యూషకాంతుల పద్మిని పులకించి
చిందెను చిన్నారి చిలిపినవ్వు
చిగురాకు సందుల పగరు గొంతుక నెత్తి
కూయసాగినది పుంస్కోకిలమ్ము
గులకరాళ్లను దొర్లించుకొనుచు కొండ
దాటివచ్చుచున్నది సెలయేటిజాలు
అరుణ కిరణమ్ము లుదయాద్రి నవతరింప
నవ్య చైతన్యము ప్రకృతి నాట్యమాడె.

—మహారాజనందనా! మీ జీవితంలో నేడు ఏ మధుర ప్రభాతం ఉదయించింది?

యువ:- ఉషాదేవీ! గ్రీకులు మగధరాజ్యము మీదికి దండెత్తి వస్తున్నారు—నిన్న చక్రవర్తి కొలువుదీర్చినారు.

ఉష:- అప్రతిహతమైన మగధసేనా ప్రవాహములో గ్రీకులు కొట్టుకొనపోతారు.

యువ:- నిజమే! కాని చక్రవర్తి వార్ధక్యదశలో ఉన్నారు. సర్వసైన్యాధిపత్యమువహించి—

ఉష:- మగధసామ్రాజ్యము వీరపురుషులకు గొడ్డుపోయినదా?

యువ:- కాదు. సర్వసైన్యాధిపత్యమును రాజకుటుంబము వహించుట మా వంశాచారము. కాని— బిందుసారుడు విశృంఖలవిహారి, స్వేచ్ఛాపరుడు, భోగలాలసుడు అనికదా లోకంలో ప్రవాదం.

ఉష:- దీనికి నేనే కారణము. ఎన్నోసారులు ప్రార్థించినాను. మీరు వినలేదు. మీ యశశ్చంద్రికకు కళంకం తీసికొని వచ్చాను.

యువ:- లేదు ఉషాసుందరీ! ఏకగ్రీవంగా రాజసభ నన్ను సర్వసేనాధిపతిగా వరించినారు. ఈ శుభవార్త నీకు తెలిపి శలవు తీసుకొని వెళ్ళటానికి వచ్చాను. దండయాత్రాలగ్నము సమీపిస్తోంది.

ఉష:- మగధసామ్రాజ్య సర్వసేనాధిపతిత్వం వహించిన రాజపుత్రునకు అభివందనాలు. కాని—

యువ:- కాని—ఉషాసుందరీ! మౌనముద్ర ధరించినావేమి? నీ మనస్సులో ఏమున్నదో—

ఉష:- రాజనందనా! నా మనస్సులో కొన్ని చిమ్మచీకటులు మెరుపుతీగెలతో ఉరుముతున్నాయి. నా మనస్సు విప్పి చెప్పటానికి భయంవేస్తోంది. ఆ మెరుపుతీగెలలో చాణుక్య

మంత్రి తీక్షణనయనద్యుతులు మిరుమిట్లు కల్పిస్తున్నాయి. రాజనందనా! నీ సర్వసేనాధిపత్యం చాణుక్యమంత్రికి సమ్మతమేనా?

యువ:- ఉషాదేవీ! చాణుక్యమంత్రికి మా కుటుంబమన్న అపార ప్రేమ. చాణుక్యమంత్రి ఆశీర్వదించి సేనాధిపతిగా అభిషిక్తుని చేశాడు.

ఉష:- కాని—చాణుక్యమంత్రి నిర్ణయానికి నా మనస్సు వేరొక అర్థం చెప్పుచున్నది. నా మనస్సులో రేగిన ఝంఝూ మారుతాలలోనుంచి అంతర్వాణి స్ఫుటంగా వినిపిస్తోంది. మీరు యుద్ధానికి వెళ్ల వద్దు.

యువ:- ఉషాదేవీ! నా అంతర్వాణి నాకు ఏమీ అపాయం లేదని ఘోషిస్తూవున్నది.

ఉష:- హృదయేశ్వరా! మీరు నాకు ఒకసారి వరం అనుగ్రహించినారు. ఇప్పుడు వేడుకొంటున్నాను. ఈ యుద్ధానికి వెళ్లవద్దు. అమ్మో, గ్రీకు సైన్యాలమధ్య నవపల్లవకుసుమ నవనీత కోమలమైన రాజపుత్రుని దేహం! అమ్మో! మీరు వెళ్లటానికి ఉషాసుందరి హృదయం సమ్మతింపదు.

యువ:- హృదయేశ్వరీ! మగధసామ్రాజ్య సభాసమక్షంలో వీరాభిషేక మర్యాదలతో మంత్రపూతమైన మంగళనినాదాలతో సర్వసేనాధిపతిగ అభిషిక్తుడనై, నేడు పిరికిపందవలె కూర్చుంటే వీరలోకం నన్ను పరిహసింపదా?

ఉష:- లోకుల మెరమెచ్చులా, ఉషాసుందరి ప్రార్థనా దీన వాక్యములా, రాజపుత్రుడు గణింపవలసినది? యుద్ధములో మీగతి ఏమైన లోకులకేమి? చాణుక్యమంత్రికేమి?

యువ:- ఉషాసుందరీమందహాసాలు నా జీవితనౌకకు ధ్రువతారకా రోచిస్సులు.

నీ చిరునవ్వులో అమృత నిర్ఝరిణీ నవచంద్రికా సుధా
రోచులు తాండవించును సరోరుహా నూత్నపరిమళ ప్రభా
వీచికలట్లు; సంజ అరవిచ్చిన గొజ్జగిపూలమొగ్గలై
పూచిన మల్లెపువ్వులయి పొంగును రెక్కలువచ్చిస్వప్నముల్

కాని—యుద్ధానికి వెళ్లడం నా విధ్యుక్తధర్మం.

ఉమ:- రాజనందనా ! మీరు వెళ్లిన మరుక్షణం నా దేహంలో ప్రాణాలు నిలువవు. మీ యిష్టం. రాజనందనా ! మీరు నేను ఇప్పుడు ఇంతదగ్గరగా వున్నప్పటికీ మీ నా మధ్య ఏవో కొన్ని సముద్రాలు ఉద్భవిస్తున్నాయి. ఒక అదృశ్యహస్తం, ఒక విద్యుల్లత, ఒక భూకంపం, ఒక అగ్నిపర్వత ప్రసారం నన్ను మీనుండి వేరుచేస్తున్నాయి—మీరు వెళ్లవద్దు

మేఘు:- (ప్రవేశించి) సర్వసేనాధిపతికి మేఘువాహనుడు వీరప్రణామం చేస్తున్నాడు.

యువ:- మేఘువాహనా ! సేనలు ప్రయాణ సన్నాహములో ఉన్నాయా ?

మేఘు:- సేనలు బయలుదేరటానికి సిద్ధంగా వున్నాయి. అదుగో రణభేరి మ్రోగుతోంది. వందిమాగధ మంజులరావాలు దశదిశల ప్రతిధ్వనిస్తున్నాయి. మీ ధవళాశ్వం విజయకల్యాణి సకిలిస్తోంది.

యువ:- మేఘువాహనా ! విజయకల్యాణిని తీసుకొనిరమ్మను, నేను వస్తున్నాను.

మేఘు:- సర్వసేనాధిపతికి విజయం........(నిష్క్ర)

యువ:- ప్రేమమయీ ! శలవు.

ఉమ:- వెళ్లటానికి వీలులేదు. నా యీ కళేబరాన్ని అధిరోహించి రాజనందనుడు నిష్క్రమింపవచ్చును ... (పడును.)

యువ:- కల్యాణీ ! సరే ! ప్రేమకోసము నా జీవితాన్ని, కీర్తిని,

గౌరవాన్ని, శౌర్యాన్ని, సర్వస్వాన్ని త్యాగం చేస్తున్నాను. ఇదిగో ఇక నేను యుద్ధానికి వెళ్లనా.

ఉష:- మీ పాదాలకు నమస్కారాలు. ఇంక నాకు మగధ సామ్రాజ్య మహారాజ్ఞిత్వం లభింపనక్కరలేదు. మీ హృదయగౌరవం లభించింది చాలు.

యువ:- ఉషాదేవీ! సేనాపతులకు ఈ విషయం వర్తమానం పంపవద్దా మరి—కలం భూర్జపత్రాలు తీసికొనిరా!

ఉష:- ఇవిగో!

యువ:- అయితే వ్రాయి—!

ఉష:- రాజనందనా! వ్రాస్తాను.

యువ:- మహావీరులారా! మగధ సామ్రాజ్య సేనాపతులారా! శ్రీ శ్రీ శ్రీ మహారాజశ్రీ మగధసామ్రాజ్య సర్వసేనాధిపతి బిందుసార కుమారుడు యుద్ధరంగానికి ప్రియురాలి ఆదేశంచేత, మరణభీతిచేత రావడంలేదు. మీరందరూ రణరంగానికి పోయి.........

ఉష:- ఇదేమి ఉత్తరం?

యువ:- ఆగు. చివరవరకూ వ్రాయి. ప్రియురాలి ఆదేశంచేత, మరణభీతిచేత యుద్ధరంగానికి రావటంలేదు మీరే వెళ్లి యుద్ధములో శత్రువులను ఎదిరించి మగధసామ్రాజ్యమును సంరక్షించండి

ఉష:- ఇదేమిటి—ఎవ్వరైనా యీ లేఖ చూస్తే నవ్వరా! రాజపుత్రుని పిరికిపంద అనుకుంటారు. నన్ను చరిత్ర చిరకాలం దూషిస్తుంది.

యువ:- ఇదంతా సత్యమేకదా! మరి ఏమని వ్రాయమంటావు?

ఉష:- సత్యమే....కాని ఇట్లు వ్రాస్తే—

యువ:- ఉషాదేవీ? ఇంక ఏమి వ్రాయమంటావు? ఈ రహస్యం ఎవరికి తెలియదు? వ్రాశావుకదా? కలం ఇస్తే సంతకం పెడతాను. లేక—

ఉష:- లేకపోతే !

యువ:- వీరపత్నివై కత్తియిస్తే, మగధసామ్రాజ్య సర్వసేనాధిపతిగా యుద్ధరంగంలో విజయలక్ష్మిని సాధిస్తాను.

ఉష:- రాజనందనా ! క్షమించు. నిసర్గమైన రాజశీవి నీ పలుకులలో హిమాలయ నిర్ఝరిణివలె ప్రవహిస్తోంది. నా హృదయం మేఘగర్జనలకు పుష్పించే కదంబ వృక్షంవలె పులకరిస్తోంది. జగదేకవీరుడవైన నీకు ఈ అబలాహృదయం అపచారంచేసినది. క్షమించు. రాజనందనా ! క్షమించు.

మేఘ:- (ప్రవేశించి) రాజనందనా ! విజయకల్యాణి జాలులో కప్పుకొనిపోయిన నునుసోగ కన్నులతో ఆహ్వానిస్తూ సకిలిస్తోంది. అదుగో సుముహూర్త ఘంటారావం !

ఉష:- రాజనందనా ! ఇదిగో కత్తి.

భారతదేశమందు నరపాలకుమారుల మేలుబంతివై
వీరుడు చంద్రగుప్త పృథివీపతి పేరును నిల్పు వీర దీ
క్షా రమణీయమూర్తివయి గైకొను మిచ్చెద ఖడ్గమిప్డు; బా
లారుణకాంతిపంక్తి భవదాననసీమను తాండవింపగా।

మేఘ:- సర్వసేనాధిపతీ !

ఉష:- ఇదుగో వచ్చుచున్నాను. కర్పూరహారతి సమర్పించనిమ్ము. (ఇచ్చును)

యువ:- వీరపత్నీ !

మందమనోజ్ఞహాస ముఖమండలమొత్తెడి తొట్రుపాటునన్
చిందరవందరై చిలిపిసిగ్గులు లేనునుబుగ్గసొట్టలో
చిందులుత్రొక్క నాదములు చిందగ ఖడ్గమునిమ్ము నా ఉషా
సుందరి లెమ్ము ! లేతమనసుల్ దిగులించు మిటారిమాపులన్

హృదయేశ్వరీ ! నేడు బిందుసారుడు మహావీరుడు. ఉషా సుందరి వీరరాజ్ఞి.

ఉష:- విజయకల్యాణిపైన ఓ బిందుసార
రాజచంద్ర సాగింపు సంగ్రామయాత్ర
అలకింపుము వినువీధి బాలభాను
సప్తరథ్య గంభీర హేషారవమ్ము!

యువ:- సుహృదభినందనాలు (నిష్క్రమిస్తారు)
మేఘ:- .........

:: (చాణుక్యమంత్రి, మహాసేనుడు, భటుడు ప్రవేశం) ::

ఉష:- చాణుక్యమంత్రికి స్వాగత నమస్కారాలు.

చా:- ఉషాసుందరీ! మేము నీ స్వాగత నమస్కారాలు అందుకో టానికి రాలేదు. నీవు రాజద్రోహినివి—పాటలీపుత్ర ప్రధాన ధర్మమూర్తి శ్రీ మహాసేనుని ఎదుట నీ విపుడు నిల్చొని యున్నావు. అభియోగం విను!

ఉష:- నేను రాజద్రోహినినా! మహామంత్రీ! ఇది అంతా నీవు పన్నిన వల.

మహా:- ఉషాసుందరీ! విను! ఈ శాసనం చాణుక్యమంత్రి ప్రయుక్తంగాదు. శ్రీ శ్రీ శ్రీ మగధసామ్రాజ్య సర్వసేనాధిపతి బిందుసార రాజచంద్రుని శాసనం! విను

ఉష:- బిందుసార రాజచంద్రుని శాసనమా! చిత్రం. అయితే యిది ఇంద్రజాలం.

మహా:- మగధసామ్రాజ్య సర్వసేనాధిపతికి గాని, సేనలకు గాని ఒక్క ముహూర్తం దండయాత్రలో అవరోధాంతరాయాలు కల్పించిన వ్యక్తికి మరణదండనమే సద్యశ్శిక్ష.

ఉష:- ధర్మమూర్తీ! అయిన నేనుచేసిన అపరాధం ఏముంది?

మహా:- నీవు సర్వసేనాధిపతియైన బిందుసార రాజచంద్రునికి... సుముహూర్త ఘంటారావం అయినతర్వాత 10 విఘడియలు అంతరాయం కల్పించావు. సమస్త సేనావాహిని 10 విఘడియలకాలం ఆగిపోయింది. తెలిసిందా?

ఉష:- తెలిసినది. మహామంత్రీ! సర్వం తెలిసినది. సరే! ధర్మస్థానంలో ఈ అభియోగం విచారించండి. నేను సంసిద్ధం. నా సాక్షులను అక్కడికే పిలిపించుకొంటాను.

చాణు:- ఉషాసుందరీ! ఒక పడుచుపిల్లకున్న తెలివితేటలు మహామంత్రికి ఉండవా? నీ వలలో పడటానికి నేను బిందుసారుణ్ణి గాను....సాక్షులు— వేరే న్యాయస్థానం అనవసరం. ఇక్కడే నిన్ను విచారిస్తాము. ఇది సైనిక ధర్మస్థానం. ధర్మమూర్తీ! మీ నిర్ణయం ఏమిటి?

మహా:- ఉషాసుందరీ! నీవు ౧౦ విఘడియలు సేనావాహినికి అంతరాయం కల్పించి ఆలస్యానికి కారణమైనావు. నీమీద నేరం ఋజువైంది. ఏమంటావు?

ఉష:- ఏమంటానా? ఈ ఆలస్యానికి నేను ఎంత కారణమో యువరాజు— కాదు— మహాధర్మమూర్తీ! నేనే కారణం. కాని—నన్ను నా యింట్లో విచారించటం అధర్మం. నాకు సాక్షిగా యువరాజును పేర్కొంటున్నాను.

చా:- యువరాజును సాక్షిగా మాత్రమే పేర్కొనటం ఏమిటి? హృదయేశ్వరునిగా పేర్కొనటం లేదా? ఉషాసుందరీ! యువరాజు స్త్రీలోలుడై భోగపరాయణుడై నశించిపోటానికి నువ్వే కారణం. 'స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ' అన్నారు. నీ మూలాన మగధసామ్రాజ్యం నశించిపోయేది.

ఉష:- అసత్యం— అన్యాయం, మహాఘోరం మహామంత్రీ!

చా:- ఉషాసుందరీ! ఒకసారి నీ వెవ్వతెవో గుర్తించుకో! నీవు ఒక సామాన్య కన్యకవు. బిందుసారుడు భావిభారత సామ్రాజ్య చక్రవర్తి. నీవు యువరాజును కాంక్షించటంకంటె ఘోరం ఏమున్నది? రాజచరిత్రను అపకీర్తి కళంకితం చెయ్యటానికి పూనుకున్న నీ పాపానికి నిష్కృతి ఉన్నదా?

ఉష:- పవిత్రప్రేమ అధికార తారతమ్యాలను పరిగణింపదు. మా ప్రేమ శరజ్జ్యోత్స్నతుషారంవలె పరమ నిర్మలమైనది. పాత్రః

సంధ్యారాగంవలె స్వర్గరంజితమైనది. పుష్పసౌరభంవలె దివ్యమైనది. తారకా రోచిస్సులవలె అగమ్యమైనది. వజ్రము కంటె కఠినమైనది. పుష్పముకంటె కోమలమైనది. పత్రం చముకంటె విశాలమైనది.

చా:- అసత్యం. ఈ కవిత్వం నీకు ఉగ్రపాలతో అబ్బింది. ఉషాదేవీ ! నీ ప్రేమ కామకళబలితం, దురాశాప్రేరితం. నువ్వు బిందుసారుని దేహాన్ని— రాజ్యాన్ని భోగాన్ని కాంక్షిస్తున్నావు అంతే !

ఉష:- ఎన్నటికీ కాదు.

చా:- ఉషాసుందరీ !— నీవు యువరాజు రాజ్యాన్ని దేహాన్ని స్వచ్ఛందముగా త్యాగం చెయ్యగలవా ? నీ పవిత్రప్రేమకు అర్థమేమిటి ?

ఉష:- మహామంత్రీ, నన్ను— నా ప్రేమను— మగధసామ్రాజ్యాన్ని పవిత్రప్రేమచే నిర్మలజ్యోత్స్నగా సుసిద్ధంచేస్తాను. కాని—సర్వం భగవంతుని అనుగ్రహం.

బౌద్ధభిక్షువు:- (ప్రవేశించి)

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

ఉష:- భగవంత ! నమస్కారాలు.

బౌద్ధ:- దీర్ఘాయురభ్యుదయ పరంపరా ప్రాప్తిరస్తు, సోదరీ ! యువరాజు దండయాత్రకై వెళ్లుచున్నాడని తెలిసి వచ్చాను. ఈ ఘోర మారణ హోమమును హింసా పశుప్రకృతిని ఉజ్జగించి విశ్వమానవ సౌభ్రాత్రింతో ప్రపంచాన్ని ఆనందస్వర్గం చెయ్యటానికి యువరాజుకంటె ఉత్తమాధికారి ఎవరున్నారు ?

మహా:- ఓ కుమ్మ పాషండ సన్యాసీ ! నీ ప్రబోధం పారుబోతులకు పనికివస్తుంది. వీరపురుషులు వర్ధిల్లే మగధసామ్రాజ్యంలో

వనికిరాదు. గ్రీకులు మాతృదేశంపై దండెత్తివస్తే గాజులు తొడిగించుకొని కూర్చోవాలా ?

శాద్ధ:- అహింసయే పరమధర్మము. జీవకారుణ్యమే సిద్ధికి త్రోవ. యమనియమాదులు ఆత్మసంశుద్ధికి తోడ్పడు నిర్వాణ సంధాయకాలు.

మహా:- వ్యర్థసన్యాసీ!నీ మాయాప్రబోధం వినేవాళ్లు ఎవరూ లేరు!

శాద్ధ:- ధర్మమూర్తీ! ప్రపంచంలో ఎప్పటికైనా పాశవిక ప్రవృత్తులు అణచి మానవుడు విజయుడు కావాలి. మానవుడు తన క్షేమ ప్రీవైభవాన్ని ఉపయోగించి ఈ భూలోకాన్ని స్వర్గంగా మార్చటానికి బదులు నరకంగా వినిర్మిస్తున్నాడు. ఈ హింసాకలాపంలో ఈ ఘోరమయ రణ హోమంతో ఆత్మసాక్షిగల ఏ మానవుడు సంబంధం కల్పించుకోకూడదు.

చాణు:- యుద్ధానికి వ్యతిరేక ప్రచారం చెయ్యటం రాజద్రోహం.

శాద్ధ:- యుద్ధానికి అనుకూలప్రచారం చెయ్యడం సకల మానవద్రోహం.

చా:- ధర్మమూర్తీ! రాజద్రోహ ప్రచారంచేసే ఈ సన్యాసికి తగినశిక్ష విధించాలి!

మహా:- ఓ పావండ సన్యాసీ! యుద్ధ ప్రతికూల ప్రచారంచేసే నీకు మరణదండన శిక్షగా విధిస్తున్నాను. ఇంక నీ ప్రబోధం కట్టిపెట్టు.

శాద్ధ:- బుద్ధం శరణం గచ్ఛామి! మరణం జీవితానికి అంతం గాదు. ధర్మమూర్తీ పొరపడుతున్నావు. నా ప్రబోధం బోధిసత్వుడనై అపరజన్మంలోకూడ సాగిస్తాను.

ఉషా:- భగవంత!—మీ నయనద్యుతులుసోకి, అగస్త్యోదయ రోచిస్సులుసోకి కలకలు తేరు నదీసుందరివలె నా హృదయం పాపరహితమయింది. అమృత నిష్యందాలైన మీ వాక్కులు జడమైన నా ముగ్ధహృదయానికి దివ్యస్పందనాలు కల్పిస్తున్నాయి.

చా:- ఉపాసుందరీ ! అధికప్రసంగం చాలించు. బౌద్ధసన్యాసీ! హింసాజర్జరితమైన ఈ పాదు ప్రపంచం నీకు వాసయోగ్య మైన స్థలంకాదు—ఉపాసుందరీ ! పవిత్రప్రేమను అర్థం చేసు కోలేని అంధలోకంలో నీవు నివసించి లాభంలేదు. అందు చేత ఈ పాదు లోకంలోనుంచి మీా యిద్దరిని పంపించి వేస్తున్నాను.

ఉపా:- మహామంత్రీ ! అవ్యాజమైన నీ కృపకు కృతజ్ఞత. కాని— ఒక్క విషయం. ఈ శిక్ష కేవలం అధర్మం, అన్యాయం— సాక్షులులేరు, విచారణలేదు ఇది నా యిలు. ధర్మస్థానం కాదు. ఈనాటి నీ ప్రవర్తనకు ఒకనాడు భగవంతునియెదుట నిల్చొనినప్పుడు నీవు సిగ్గుచే తలవంచుకుంటావు.

> నా పదనమ్మనన్ కపటనాటకమున్ పచరించి గుట్టుగా
> చేసిన ఘోరహత్య యిది ఛీ యనరే ఎవరైనవిన్న ఈ
> మోసము నేడు; నీ ప్రజలముందరనే భవదీయబుద్ధి వి
> న్యాసము నేలచూావు? మహామతివైన అమాత్యపుంగవా?

చా:- ఇది నీ యిల్లుమాత్రమేకాదు. ఈ భవనం ఇప్పటివరకు బిందుసార రాజచంద్రుని శరజ్జ్యోత్స్నా సుమమాసుకుమార స్వప్నసౌధం. భావిభారత దివాస్వప్న సామ్రాజ్య మిథ్యా చక్రవర్తిని అంతఃపురం. ఇకముందు మృత్యుసామ్రాజ్య పట్టమహిషి కారాగారవాసం. మునుముందు బిందుసార చక్రవర్తి బొమ్మతుపారవర్షనివేశం. భావిమగధసామ్రాజ్య చక్రవర్తినివి నీవేనా ? ఉపాసుందరీ !

ఉపా:- మహామంత్రీ ! మగధసామ్రాజ్యంలో పట్టమహిషినే అవు తానో భిక్షుకసామ్రాజ్యంలో బిచ్చగత్తెనే అవుతానో ఎవరు చెప్పగలరు ?

చా:- ధర్మపాలా ! ఈ బౌద్ధసన్యాసిని తీసుకొనివెళ్లి పాటలీపుత్ర దుర్గంలో బంధించు— మగధసామ్రాజ్య మిథ్యాచక్రవర్తినీ ! నా ఆజ్ఞలేనిదే నాలుగుక్రోసులచుట్టు కాకి అయినా వ్రాలదు ! మరణకాలాన్ని నిరీక్షిస్తూ మృత్యుసామ్రాజ్యాన్ని ఏలుకుంటూ అంతవరకు కాలం గడుపు.

[—తెర—]



# ధర్మచక్రం



## సప్తమ రంగము

స్థలం : పాటలీపుత్రం శ్మశానవాటిక

వీరదాసరి: సచ్చిపోయినోణ్ణి సావబోయేవోళ్లు
మోసికొని రండోయి తీసికొని తెండోయి
సాణుక్కులాగ్గనే సాపుమూ డినవోణ్ణి
కట్టుకొని రండోయి కాటికిని తెండోయి.

ఒరేయి. వజ్రబాహూ ! ఏమిటోయి. మొగం ఏలా డేసి కూకుంటావ్.

వజ్రబాహు:- ఏంటోరా దాసూ ! బుద్ధసన్యాసికతలు ఇంటూన్న కాడినుంచి ఈ స్మశానంలాగ నా గుండె పొగలు గ్రమ్ముకు పోతోందిరా ! పాటలూ పదాలు నీకుమల్లే పాడలేనురా !

వీర:- ఒరేయి. సోద్యాలు సెప్పతావు. మరి కాటికాపలా అంటె ఏకాకోశం అనుకుంటున్నావురా ! నీకు సన్యాసికతలతో మతిపోయింది.

వజ్ర:- ఒరేదాసూ ! చూడు. నిన్న ఎన్నపూసలాంటిపిల్ల మళ్ళీ నూతావురా ! ఆ తల్లిగోల సూడలేకపోయాము.

వీర:- ఒరేయి ! సస్సిపోయినోళ్లతో మనంకూడ సస్తే ఇక బదకటం ఎల్లాగ ? ఒరే ఇవన్ని సూసి సూసి ఈ వద్దెసిలకంటె మొద్దుబారిపోయిందిరా నా గుండ. కాని— ఒక్కొక్కప్పుడు— ఈ సోననది నా గుండెకాయులోనుండి పారుతుంది అనిపిస్తుందిరా !

ఉష, భటుడు—(ప్రవేశం)

ఉషాదేవి:- నాపాట ఆలింపవా ! ప్రభూ !
నామాట పాలింపవా ! ప్రభూ !

మిణుకుమిణుకులమింట మెరసినట్టిచుక్కలు
చిన్నారిపొన్నారి చిరుత వెన్నెలజాలు
కారుమబ్బులలోన కలసిపోతున్నాయి
కన్నుమిన్ను గానని చిమ్మచీకటిలోన
చిక్కుకొనియున్నాను
ఏ దిక్కు చూపింతువో ప్రభూ !
ఏ దారి కల్పింతువో ప్రభూ !
మెరపుతీగెలలోన మెరసిమెరసిపోతూ
మిరుమిట్లలోముంచి మింటిమబ్బులలోన
మాయమైపోతావు నిముసమైనానిలిచి

నీ రూపు చూపించవా ? ప్రభూ !
నీ మాట వివిపించవా ? ప్రభూ !

ధర్మపాలుడు:- వజ్రబాహూ ! వీరదాసరీ ! ఈ ఉషాసుందరికి చక్రవర్తి మరణదండన విధించినారు. ఈ రాజద్రోహినిని వధించండి.

వజ్ర:- మల్లెమొగ్గలాంటి యీ సక్కనిసుక్కని నరికేయమంటారా!

ధర్మ:- ఇది రాజాజ్ఞ.

వీరదాసరి:- సిత్తం.

( ధర్మపా॥ నిష్క్రమిస్తాడు )

వజ్ర:- ఇదిగో అమ్మా ! ప్రార్థనసేసికో.

ఉషా:- లోకం నీడా లేక దారి తెన్నూ లేక

ఆకులల్లాడనీ అడవిప్రవాహాలమధ్య
అల్లాడుచున్నాను

ఏ చోటు చూపింపవా ! ప్రభూ !
నా పాటు తప్పింపవా ?

దిగ్రేఖావలయము దృక్పథమునందునిడి
కర్ణధారుడులేని కలముపై గూర్చుండి
కాలమహాప్రవంతి కదలిపోతున్నాను.

ఏ దీవి కల్పింతువో ! ప్రభూ !
ఏ రేవు చేర్పింతువో !

జగన్నాటకరంగశాల వేషధారిగ
విషాదాంత జీవితవృత్తాలు వినిపించు
వింతవింత పాత్రలవేసి నటించినాను

ఏ ఆట ఆడింతువో ! ప్రభూ !
ఏ పాట పాడింతువో ! ప్రభూ !

వీరదాసరి:- ఒరే ! వజ్రబాహూ ! అల్లా ఆకాశంకేసి చూస్తా వేమిరా ! కత్తి తీయ్.

వజ్ర:- భగవంతుణ్ణి పేర్థన సేసుకునేవోళ్లను సంపొద్దని మాఅయ్య సచ్చిపోయేటప్పుడు సెప్పాడు.

వీర:- ఓ అమ్మో ! ఇట్లానూడు ! ఇక్కడకూకో ! కళ్లుమూసుకో. తలకాయవంచు ! భగవంతుణ్ణి తలుసుకో ! ఆ తరువాతపని మేం కానిస్తాం.

— ♦ బౌద్ధసన్యాసి. ధర్మపాలుడు ప్రవేశం ♦ —

బౌద్ధసన్యాసి:- బుద్ధాయ సద్ధర్మ తేజో ప్రదీపాయ
తుభ్యం నమోనమః
దీనజనరక్షాయ దివ్యప్రబోధాయ
సర్వభూతదయా స్వరూపాయ
తుభ్యం నమోనమః ……… బుద్ధాయ॥

ధర్మ:- వజ్రబాహూ ! ఇంకా ఉషాసుందరిని వధించలేదేం ?

వజ్రి:- ఆగండి—సాలాసేపటినుండీ ప్రార్థన చేసికొంటున్నారు.

ఉషా:- మహాభాగా ! ఆషాఢ మేఘమాలిక మధ్య తటిల్లతలవలె మిరుమిట్లుగొల్పు మీ నయన ద్యుతులకు నా హృదయం మొగలిరేకువలె వికసిస్తున్నది. భగవన్, నమస్కారాలు.

బౌద్ధ:- బుద్ధభగవానుడు నిన్ను అనుగ్రహించుగాక.

ధర్మ:- వీరదాసరీ ! ఈ సన్యాసి రాజద్రోహి. ఇతణ్ణి గూడ వధించండి.

వీర:- సిత్తం, సిత్తం.

వజ్రబాహు:- ఈ సాములోరు సేసిన నేరం ఏమిటి ?

ధర్మ:- నోరుముయ్—నీ కనవసరం.

బౌద్ధ:- ఇయ్యది శ్మశానవాటిక ఇందు వీరు
వార లందరు రాజాలగోపాలముగను
జాతిభేదాలు లేక భుజాలు రాసి
కొనుచు పడియున్నవార లగోచరముగ.

ఉషా:- మహాయోగీ ! నీ అమృత హృదయం గానస్రవంతికగా కరగి భాగీరథివలె ప్రవహిస్తే, ఈ వల్లకాటిలోని బూడిదనేల పవిత్రమౌతుంది.

అఖిలప్రాణికోటుల జీవయాత్రలకును
గడవరానట్టి ప్రకృతిక గమ్యబుద్ధి
మూడుకాలాల పరిత్యత బోధసేయు
తత్త్వవేదాంత విశ్వవిద్యాలయమ్మ !

బౌద్ధ:- తల్లీ ! ఉపాసుందరీ !—బుద్బుదప్రాయమైన ఈ దేహం కంటె మానవహృదయాన్ని ఆవరించిన మమకారమే ఎక్కువ శోక కారణం.

తొణకు కన్నీరు లో గుక్కుకొనుచు వణకు
చేతితో ఎవ్వరో పిల్లగోతిమీద
పాలు ధారపోయుచునున్నవారు; కట్ట
కడపటి ఋణానుబంధమ్ము నుడువుకొనుచు.

ఉప:- మహాభాగా !

పాపం ! అచ్చట నీడవలెనిలిచి కన్నీరు తుడుచుకొనుచున్న ఆ అభాగ్యుడెవరోకదా ! తండ్రీ ! సుధామాధుర్య తరంగితమైన నీ వచస్సు మృత్యుదేవతను . కాముకును అతిక్రమించుచున్నది. మహాభాగా ! నన్ను కరుణింపుము.
బౌద్ధ:- తల్లీ ! ఉపాదేవి !

కన్నతీపికి తల్లి కడుపుశోకాలుమ
ఆరకమండెడి కారుచిచ్చు
ఏ పాపపుణ్యమ్ము లెరుగని మూపులన్
బ్రద్దలైపోయిన భాండచయము
మూడునాళ్ళైనను ముచ్చట తీరకముందు
తెగిన నల్లపూసచేరు
కన్నీరు మున్నీరుగా ఆర్ద్రహృదయాలు
కాగి కరగి కార్చు కరుణరసము

కాలపురుషుని గర్భాన కలసిపోయి
చివికిపోయిన పాత అస్థికలతోడ
పొరలుచున్నవి బూడిద బుగ్గికలసి
ప్రకృతి నిర్మించు ఈ వింత రంగభూమి !

ఉప:- మహాశయా ! నా మరణకాల మాసన్నమైనది. స్వర్గ లోకం విశృతద్వారాలతో నన్ను ఆహ్వానిస్తున్నది. అచ్చట బుద్ధభగవానుని జ్యోత్స్నానుపమా గంభీరమైన నయనద్యుతులు అమృతవర్షం చిందుతున్నవి. నేను మరణించటానికి ముందుగా నాకు బౌద్ధదీక్షను అనుగ్రహించు—ప్రభూ !

బౌద్ధ:- తల్లీ ! ఇదిగో బౌద్ధదీక్షను పరిగ్రహించు— ఈ క్షణం నుండి నీవు పరివ్రాజికవైనావు.

ఉప:- మహానుభావా ! నా జన్మ తరించింది. ఇక మరణానికి నేను భీతి చెందటంలేదు.

బౌద్ధ:- తల్లీ ! ఉపాసుందరీ !

మరణము, జీవయాత్రకు సమాప్తముగాదు, అపారపాప జర్జరిత మహాప్రపంచము రుజావికలమ్మయిక్రిగు, స్వర్గసుందరనుగు బుద్ధదేవు కరుణాగతి నూత్నయుగోదయ ప్రభా కిరణములన్ వెలార్చి వెలిగించును లోకములన్ సహోదరీ.

ఉపా:- మహాభాగా ! మరణించటానికి పూర్వమే నేను మరియొక జన్మమెత్తాను. బౌద్ధసన్యాసినిగ మరణించటంకంటె నా జీవితానికి వేరే ఉత్తమలక్ష్యం ఏమీ అర్థింపను. వజ్రబాహూ! రా ! నన్ను వధించు.

బుద్ధదేవుడు పుట్టిన పుణ్యభూమి
ఈ శరీరమునుండి స్రవించునట్టి
రక్తవాహిని నవయుగారంభమందు
అరుణకాంతులై జేశాల నలముగాక !

వజ్రి:- ఒరేయి—దాసూ ! నువ్వు చంపరా ! నా చెయ్యిరావటం లేదు.

వీర:- ఒరే ! వజ్రిం. నిన్న ఇద్దరిని నేనే చంపాను. ఈ సారి నీ వంతు.

వజ్రి:- నువ్వుచంపరా ! నా గుండె చాలా మెత్తంది రా !

వీర:- నా గుండె కరక్కాయిరా ! సోద్దాలు సెప్తున్నావు.

ధర్మ:- ఒరేదాసరీ ! ఈ ఉమను నువ్వు నరుకు—వరే వజ్రిం ఈ సన్యాసిని నీవు నరుకు—సన్యాసీ !—ఆల్లాకూకో్చ.

బౌద్ధ:- నేను సంసిద్ధం.

వజ్రి:- దండాలండీబాబూ ! మిమ్మల్ని నరకటానికి నా చేతులు రావడం లేదు. ఇటు రాజగోరి ఆగ్గి. అటు గురువుగోరు. అటు నుయ్యి. ఇటు గొయ్యి.

బౌద్ధ:- వజ్రబాహూ ! ఇది నీ విధ్యుక్తధర్మం. పాపం నీవేమి చేస్తావు—నీ పని నువ్వు చెయ్యాలి.

వజ్రి:- ఏమయ్యొయ్యి, దమ్మపాలా ! ఇటునూడు, ఆకాశం ఊడి పడ్డాసరే! నేను నరకను.

ధర్మ:- ఇది రాజాజ్ఞ తెలుసునా ?

వీర:- ఒకసారే గుండె రాయిసేసుకోవాలి,—నేనూ నరకను.

ధర్మ:- మీ తలకాయలు కూడా వుండవు.

వజ్రి:- పోనీ ! ఈరు మా గురువుగారు. మా మాలపల్లెలో దేముడు.

ధర్మ:- ఛీ ! నోరుమూయండి—మిమ్మల్ని చిత్రవధచేసినా పాపం లేదు— రాజాజ్ఞను తిరస్కరించడమే— ఛీ ! రాజద్రోహులారా ! మగధరాజ్య చక్రవర్తిత్వం నశించలేదు—ఇదిగో నా కత్తి—మీ తలకాయలుండవు.

వజ్రి:- మా దగ్గిర కత్తులున్నాయ్ కాసుకో.

( టక్...టక్...టక్...తెర )

# ధర్మచక్రం

## అష్టమ రంగము

[ స్థలం :— మహాసేనుని గృహారామం. ]

నీలకేతనుడు:- (దగ్గుతూ) నందినీ ! నందినీ !

నందిని:- (ప్రవేశించి) ఏం—నీలకేతనా ! నీ దగ్గు ఎటావున్నది ?

నీల:- నందినీ ! దగ్గు తగ్గిపోయింది.

నంది:- ఇదుగో కప్పి అరగదీసి మందు ఇస్తాను.

నీలమేఘాలలో నింగిపై ఉరిమేటి
మెరుపుతీగెలమధ్య
నీ రూపుచూచాను; నీ మాట విన్నాను॥ నీల॥

నీల:- అపరసంధ్యారాగం వలె నిశాతిమిరంలో కలసి కరగిపోతోంది నీ గీతం నందినీ !

నందిని:- నీలకేతనా ! కూర్చో ! ఎందుకులేస్తావు ? అనవసరంగా ఆయాస పడకు.

నీల:- నందినీ ! నాకు దగ్గు తగ్గిపోయింది. శోణనదీతీరంలో నాకు యువరాజు ఇచ్చిన మామిడితోపులో ఒక పెద్దమేడ కట్టిస్తాను. అక్కడ మీ ఉద్యానవనంకంటె పెద్దఉద్యానవనం వేయిస్తాను.

నందిని:- నీవు కట్టబోయే మేడముందు పెరగబోయే ఉద్యానవనంలో వికసించబోయే పువ్వులమధ్య విహరించబోయే ఓ నీలకేతనా ! ముందు మందు తీసికో—తరువాత గాలిలో మేడలు కట్టుదుగాని.

నీ:- నందినీ! చూడు— నాకు దివ్యదృష్టి ఉంది. శోణ నదీ తీరంలో ఒక దివ్యప్రాసాదం. ఆ సుందర ప్రాసాదంచుట్టు ఒక రమణీయ పుష్పవనం. ఆ రమణీయ పుష్పవనంలో దివ్యసౌరభంవలె నీవుకూడా విహరిస్తూవుంటావు. అప్పుడు నేను నీ చిరునవ్వుల సోన వెన్నెలలో జీవితాన్ని ఒక కమ్మని కలవలె శోణ నదీప్రవాహ వినాదాలకు శ్రుతిగల్పుకొని పాడుకొంటాను.

నందిని:- నీ మాటలు నాకు అర్థం కావు నీలకేతనా!

నీల:- మిసిమి యౌవనంలో పండే నవ్యలావణ్య తరంగిణివి నీవు నందినీ—నీకు ఈ మాటలు అర్థంకావంటే నాకు నమ్మకం లేదు. నీకు ఉద్యాన లతలంటే చాలా ప్రీతి. మన ఉద్యానవనంలో నందిని లావణ్యాలవాహినై ప్రవహించాలని నా ఉద్దేశం.

నందిని:- అంటే?

:: గండోదరమిత్రుడు—ప్రవేశం ::

గం:- అంటేనా! నందినీ! నీకు అర్థంకాకపోవచ్చు. —అర్థమయినా అర్థంకానట్లు నటించవచ్చు. కాని నీలకేతనుడి బాధ నాకు చాలకాలంకిందట అర్థమైంది.

నందిని:- గండోదరా! ఏం ఇట్లావచ్చావు. మా నాన్నగారి కోసమా?

గండు:- కాదు; అవును; కాని నందినీ! నీవు మందు ఇచ్చేటప్పుడు ఆ నీలకేతనుడు మధురవ్యధ అనుభవిస్తున్నాడు.

నంది:- నిజమే! నీలకేతనుడు ఎప్పటికప్పుడు తగ్గిపోయిందంటాడు. కాని అతన్ని దగ్గు పీడించి పిల్చి పిప్పిచేస్తోంది.

గం:- నందినీ! నీవంటి సుందరి మందు ఇస్తూవుంటే ఇలాటి పది దగ్గులతో బాధపడతాను పడమంటే.

నం:- వద్దు, శతువ్రుం కుకూడా వద్దు ఈ ఒక్కదగ్గుబాధ.
గం:- నీలకేతనుడికి రెండుబాధలు, దగ్గు ఒకటీ—మరి ఒకటి—
నీవు మందు ఇచ్చేటప్పుడు నీ పైటచెంగుగాలి వాడి ఊపిరి తిత్తులకు పోయి ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు
నంది:- గండోదరా! ఏమిటిక్షోరణి? ఇంక అధికప్రసంగం కట్టి పెట్టు. నేను చెల్లెలివలె నీలకేతనుడికి సేవ చేస్తున్నాను.
గం:- నీ మాటకాదు—నేను చెప్పేది— పోనీ నా మాట అబద్ధ మని నీలకేతనుడిని చెప్పమను- మౌనం అర్ధాంగీకారసూచకం.
నంః:- ఛీ! నోరుమూయ్.

(నిష్క్రమిస్తుంది)

గం:- నందినీ! మేఘవాహనుడు—
నంది:- (ప్రవేశించి) ఏమైనా ఉత్తరం వచ్చిందా! యుద్ధవార్త లేమిటి?
గం:- యుద్ధవార్తలు—ఉన్నాయ్- కాని- ఇదుగో నోరుమూసికో మన్నావుగా! మూసుకుంటున్నాను. మాట్లాడమనేదాకా మాట్లాడను.
నంది:- గండోదరా! మాట్లాడు— కోపగించుకోకు. మేఘ వాహనుడు అన్నావేమిటి— అతడు క్షేమంగా వున్నాడా! యువరాజు ఎప్పుడు తిరిగివస్తారు?
గం:- విసవిసా వెళ్లిపోయావు! ఇప్పుడు వెళ్లిపోవేం!— మేఘ వాహనుడు...
నందిని:- చెప్పు గండోదరా! చెప్పు వెళ్ళిపోనులే!
గం:- గ్రీకులు సింధునదీతీరాన మహాయుద్ధంలో ఓడిపోయారు. మా మిత్రుడు దండుకేశ్వరమిత్రుడు వీరస్వర్గం అలంకరించాడు. మేఘవాహనుడు....
నందిని:- మేఘవాహనుడు?
గం:- మేఘవాహనుడు సింధునదినిదాటి గ్రీకులను వెన్నంటినాడు.
నందిని:- అమ్మయ్య! నాన్నగారూ! నాన్నగారూ!

:: మహాసేనుడు ప్రవేశం ::

నందిని:- నాన్నగారూ ! గ్రీకులు ఓడిపోయారు.

మహా:- తల్లీ ! ఈ శుభవార్త ఎప్పుడు తెలిసింది? ఎవరు చెప్పారు?

గం:- మేము గండోదరవిశిష్యులం- నమస్కారాలు.

మహా:- ఏమి ! గండోదరా ! యువరాజుగారు ఎప్పుడు తిరిగి వస్తున్నారు? మేఘవాహనుడు యువరాజుతో తిరిగి వస్తాడా !

గం:- మేఘవాహనుడు... మేఘవాహనుడు...

మహా:- గండోదరా ! ఏ మట్లా తటపటాయిస్తున్నావు ?

గం:- మేఘవాహనుడు గ్రీకుల వెన్నంటిపోయి మరణించాడు.

నందిని:- నిజమే !

గం:- నిజమే.

నీల:- ఏమి ఇంతవరకు చెప్పలేదు ?

గం:- చావుకబురు చల్లగా చెప్పమన్నారు.

మహా:- మేఘవాహనుడు మహాయోగ్యుడు, వీరస్వర్గ మలంకరించాడు.

నీల:- మేఘవాహనుడు అదృష్టవంతుడు—వీరస్వర్గం లభించింది.

గం:- నందినీ! దుఃఖించకు, యుద్ధంలో మేఘవాహనునివంటి వీరులు వేనకు వేలు మరణించారు.

నంది:- నేను దుఃఖించటంలేదు.

మహా:- వీరస్వర్గ మలంకరించిన మహాపురుషునికోసం దుఃఖమెందుకు ?

నీల:- ఆహా ! వీరస్వర్గం లభించటం ఎంత అదృష్టం !

నందిని:- వీరస్వర్గం. ఈ వీరస్వర్గానికి అర్ధమేమిటి ? ఈ యుద్ధం వల్ల ప్రయోజనం ఇదేనా ? గండోదరునివంటి మహావీరులు, నీలకేతునువంటి ఆరోగ్యవంతులు బ్రతికివుంటారు. మేఘవాహనునివంటివారు మరణిస్తారు.

నీల:- నందినీ ! దుఃఖాపకా- శోణనదీతీరాన వసంతోద్యానం
నిర్మించి—

నం:- నీలకేతనా ! నోరు మూసికో !

గం:- పాపం, మేఘవాహనుడు మరణించాడు.

నందిని:- దుర్మార్గుడా !— ఈ శుభవర్తమానం వినిపించటానికేనా?
నీవు పనికట్టుకుని వచ్చింది—

మహా:- యుద్ధభూమిలో రక్తసాగరంలో దొర్లుతూ వికలాంగులై
శోనపూరిలో మరణవేదనను అనుభవిస్తున్న సిపాయాత్మల
దీనవేదనాక్రందనాలు— నా చెవులలో గింగురుమంటున్నాయి
అదుగో ! మహాకాళి ! బ్రహ్మశిరస్సులో రుధిరపానం చేస్తోంది.
అదుగో ! అదుగో మహాకాళి ! (తె.)



# ధర్మచక్రం



## నవమ రంగము

స్థలం, పాటలీపుత్రం. సామ్రాజ్యపరిషత్తు.

వందిమాగధులు :- శ్రీ శ్రీ శ్రీ మహారాజ రాజశ్రీ మగధ సామ్రాజ్య సార్వభౌమ, చంద్రగుప్తచక్రవర్తి జై జై జై !!! శ్రీ శ్రీ శ్రీ మహారాజ రాజశ్రీ కుమారచక్రవర్తి శ్రీ శ్రీ శ్రీ బిందుసార యువరాజ జై జై జై !!

(చంద్రగుప్త బిందుసారుల ప్రవేశం)

చాణుక్యమంత్రి:- కుమారచక్రవర్తీ! బిందుసార రాజనందనా! గ్రీకులను ఎదిరించి దిగ్విజయం సాధించివచ్చిన యువరాజునకు నా అభివందనాలు.

యువ:- మంత్రిపుంగవా! కృతజ్ఞతా నమస్కారాలు. పేరునకు బిందుసారుడు సేనలను శాసించినాడుకాని యథార్థంగా చాణుక్యమంత్రి అదృశ్యహస్తమే విజయలక్ష్మిని సాధించింది.

చాణుక్య:- కుమారచక్రవర్తీ! జగదేకవీరుడైన చంద్రగుప్త చక్రవర్తికి ప్రధానమంత్రిగా మగధసామ్రాజ్యానికి సేవచేశాను. సేవాధర్మంలో నేను పండువృద్ధుడనై పోయాను. నీవా! తండ్రికి తగిన పుత్రుడవై దిగ్విజయం సాధించివచ్చావు. ఇక నేను ఆశ్రమవాసినై నా జీవయాత్ర ముగించాలని వాంఛిస్తున్నాను.

చంద్ర:- కుమారచక్రవర్తీ! నీ దిగ్విజయానికీ మగధసామ్రాజ్యం కర్పూర నీరాజనాలతో ఆనందిస్తోంది. చక్రవర్తివై ఈ రాజ్యాన్ని శాసించు. చాణుక్యమంత్రి నాకు ప్రధానిమాత్రమే

కాదు ! మౌర్యవంశానికి కులగురువు. ఈ మహామంత్రి శేముషీధౌరంధర్యం భారతద్వీపకల్పానికి ఆకారరేఖలు తీర్చిదిద్దింది. చాణుక్యమంత్రి లేకపోతే అద్యతన భారతచరిత్ర వేరుగా వుండేది. నేనుకూడ ఆశ్రమవాసినై చాణుక్యమంత్రిని అధిగమిస్తాను కుమారా ! నా తుదికోరిక......

యువ:- మహాచక్రవర్తీ! మీా ఆజ్ఞను శిరసావహించి అసిధారావ్రతంగా ఆచరిస్తాను.

చంద్ర:- నాయనా ! గౌడదేశాధిపతి శ్రీ శూరసేనుని ప్రథమ పుత్రిక సౌదామనిని వివాహం చేసికొని యీా సామ్రాజ్యాన్ని ఏలుకో. ఇది నా కోరిక. చాణుక్యమంత్రి ఆదేశం.

యువ:- (మౌనం)

చంద్ర:- యువరాజు మౌనముద్ర వహించటానికి కారణం ?

చాణు:- సిగ్గుకాబోలు ! మౌనం అంగీకారసూచకం.

చంద్ర:- సంతోషం నాయనా ! తండ్రి ఆదేశాన్ని మన్నించే పుత్రులే పుత్రులు. సంతోషం.

( గండోదరమిత్రుడు, మహాసేనుడు ప్రవేశం )

గండు:- బిందూా ! బిందూా ! ధన్యవాదాలు. గ్రీకుసేనాసమూహాలకు సింహస్వప్నం బిందుసార రాజచంద్రుని నామధేయం.

చాణు:- ఆగు ! గండోదరా ! ఇది మగధ సామ్రాజ్య సార్వభౌముని నిండు కొలువుకూటం, ఏమిటీ వికటాట్టహాసతాండవం! ఆర్య ! మహాసేన ! యీా సంకెళ్ళు ఏమిటి, వైపరీత్యం !

మహా:- మహామంత్రీ ! నా కర్మ ! మగధసామ్రాజ్యంలో అంత ప్రతిష్ఠా గౌరవాలు సంపాదించి ఇంతకు పాల్పడవలసివచ్చింది. ఈ సంకెళ్ళు గండోదరుడు తగిలించాడు.

చాణు:- మహాసేన మహాశయా ! అపరాధం క్షమించాలి. ధర్మపాలా, ఈ సంకెళ్లు తీసివెయ్యి.

ధర్మ:- చిత్తం- ఊడదీస్తున్నాను.

గండు:- ధర్మపాలా ! ఆగు ! ఈ సంకెళ్లు ఊడదీయటానికి వీలు లేదు.

చాణు:- ఊడదీయ్ ! ఇది చాణుక్యమంత్రి ఆజ్ఞ

గండు:- ఆగు. ఊడదీయవద్దు- ఇది గండోదరునిఆజ్ఞ. బిందుసారా! ఆజ్ఞాపించు !

బిందుసార:- ధర్మపాలా !

ధర్మ:- చిత్తం.

యువ:- ఆర్యమహాసేనుని సంకెళ్లు ఊడదీయి! గండోదరా! నిన్ను ఆనాడు మహాసేనుడు శిక్షించటం ధర్మం. నీ అంతరం నీవు తెలిసికో ! చాణుక్యమంత్రిని ఎదిరించటానికి దేవేంద్రుడుగూడ గజ గజ వణికిపోతాడు.

చంద్రి:- కుమారచక్రవర్తీ ! ధన్యవాదాలు. చాణుక్యమంత్రిని గౌరవించటం చంద్రిగుప్త చక్రవర్తిని మన్నించటమే.

గండు:- చాణుక్యమంత్రిని గౌరవించాలీ ! ఛీ ! ఛీ ! సిగ్గుచేటు !

చంద్రి:- ఈ అసంబద్ధ ప్రలాపి ఎవరు ? మహాసేన మహాశయా ! యువరాజును ఏకవచనంలో సంబోధిస్తున్నాడు!

మహా:- యువరాజు ప్రాణమిత్రుడననీ యువరాజుఆజ్ఞ అనీ చెప్పి నన్ను సంకెళ్లతో బంధించాడు.''

చంద్రి:- కుమారచక్రవర్తీ ! యీ విషయం నీవే పరిష్కరించాలి!

గండు:- నేను యువరాజునకు ప్రాణస్నేహితుణ్ణి.

చంద్ర:- ఆగు ! యువరాజు మాట్లాడుతున్నాడు.

యువ: గండోదరా ! నీ ప్రవర్తన మిక్కిలి అసభ్యం. మహాసేనుని బంధించమని నేను నిన్ను ఆజ్ఞాపించానా ? ఇది అసత్యం.

గం: యువరాజా ! నేనే యితనిని బంధించాను. దీనికి-

యువ:- ఛీ! నీకు ఆ అధికారం లేదు. నీకు మతిపోయింది. ధర్మపాలా! ఇతనిని రాజదుర్గంలో బంధించి రేపు నాదగ్గిరకు తీసుకొనిరా!

ధర్మ:- చిత్తం.

గండ:- బిందూ! ఒక్క మాట! నీ స్నేహంపట్టి నేను చెడిపోయాను దండుకేశ్వరుడు పాపం మరణించాడు. ఉషాదేవి! ఇంకెక్కడి ఉషాదేవి!

యువ:- అదేమిటి గండోదరా!

గండ:- యువరాజా! నా ప్రవర్తన అసభ్యం. ఉషాదేవిని మహాసేనుడు చాణుక్యుడు కలిసి రహస్యంగా హత్యచేశారు. ఘోరహత్య!

యువ:- మహాసేన! ఇది యథార్థమేనా?

గండ:- అక్షరాలా యథార్థం.

మహా:- కుమారచక్రవర్తీ! ఇది యథార్థంకాదు. కానీ—

యువ:- కాని ధర్మమూర్తీ! ఆలస్యం చెయ్యకుండా చెప్పు.

మహా:- ఉషాసుందరికి మరణదండన విధించాను.

యువ:- ఓహో! తెలిసింది ధర్మమూర్తీ! ఎవరి శాసనాన్ననుసరించి?

మహా:- బిందుసార రాజనందనా! మరచిపోయినట్లున్నారు— మీ శాసనాన్ననుసరించే!

యువ:- నా శాసనం! ఆశ్చర్యం! మహామంత్రీ! ఇది విచిత్రం. ఈ యింద్రజాలాన్ని విప్పి చెప్తారా?

చాణు:- రాజనందనా! నీవు సర్వసేనాపతిగా ప్రయోగించిన ప్రథమ శాసనం జ్ఞప్తికి వచ్చిందా! సేనకుగాని సర్వసేనాధిపతికిగాని నాలుగు ఘడియలు అవరోధం కల్పించిన వ్యక్తికి మరణశిక్ష.

యువ:- అవును—అయితే ?

చాణు:- ఉషాసుందరి నీకు కర్పూర నీరాజనం ఇస్తూ—సర్వ సేనాధిపతికి సర్వసైన్యనివహాలకు ౧౦ విఘడియలు పైగా అంతరాయం కల్పించింది.

యువ:- హతవిధీ! ఎంతఘోరం జరిగింది! మహామంత్రీ! ఉషా సుందరి ఇప్పటికి బ్రతికివున్నదా ?

చాణు:- బ్రతికివున్నదా ? భూతకాలములో బ్రతికేవున్నది వర్త మానకాలమున బ్రతికిలేదు. మగధ సామ్రాజ్యంలో రాజ శాసనం ఉచ్చారణకు మరుక్షణం జరిగిపోయినచరిత్రకు చెంది పోతుంది. కానిచో—ఈ పాటికీ మగధ సామ్రాజ్యాధిపత్యంలో యువరాజు ఈ ప్రశ్న అడగటమే అసంభవం.

యువ:- మహాచక్రవర్తీ! మీరూ చాణుక్యమంత్రీ ఆశ్రమవాసులై అరణ్యాలకు పోసిద్ధపడ్డారట. నేనే రాజ్యాన్ని త్యజించి అర ణ్యాలకు పోసంకల్పిస్తున్నాను

గంధు:- ఛీ! సిగ్గుచేటు. యువరాజా, గొప్పపని చేస్తావు? గ్రీకు లను జయించిన మహావీరుడట! కుమారచక్రవర్తీ! ఈ ఘోర హత్యచేసిన మహాసేనుణ్ణి శిక్షించు—మరణదండన విధించు.

మహా:- రాజనందనా! పుణ్యమో పాపమో! నీ శాసనాన్ని పరిపాలించాను. ఇదిగో రక్తహాసం. నాకు ఏ మాలవాడి చేతనో చావటం ఇష్టంలేదు. నా శిరస్సును నీ చేతులతో ఖండించు.

యువ:- ధర్మమూర్తీ! నీవు నిర్దోషివి! నీవంటి ధర్మమూర్తులు మగధసామ్రాజ్యానికి అలంకారాలు.

మహా:- కుమారచక్రవర్తీ! నా జన్మ తరించింది. కాని— పశ్చాత్తాపం నా హృదయాన్ని దహించివేస్తోంది. మగధ

సామ్రాజ్యాన్ని పరిపాలించే రాజశక్తి, ధర్మాన్ని అనుశాసించే కృపానిష్ఠ నన్ను జయించాయి.

గం:- రాజనందనా ! రాజశక్తి కృపానిష్ఠ మహాసేనల్ని సంరక్షింప వచ్చు ! రాజులు శత్రువులను గౌరవించటం నేర్చుకొనినట్లు మిత్రులను గౌరవించటం నేర్చుకోరు. నీవు మహాచక్రవర్తివి. నీకు ఎందరో దండుకేశ్వరులు గండోదరులు లభిస్తారు. కాని ఉషాసుందరి మాత్రం లభిస్తుందా ?

(ఉషాసుందరి: బౌద్ధభిక్షువు: వజ్రబాహువు: వీరదాసరి—ప్రవేశం)

యువ:- ఇది ఇంద్రజాలమా ? యథార్థమా ! ఉషాదేవీ !

ఉష:- యథార్థమే.

యువ:- ఉషాదేవీ !

ఉష:- రాజనందనా !

ధర్మ:- మహారాజా ! విప్లవం! మహావిప్లవం! మగధసామ్రాజ్యంలో ఈ మాలవాళ్లు రాజాజ్ఞను తిరస్కరించారు.

యువ:- ఎవరు ? వీరు చేసిన నేరమేమిటి ?

వజ్రబాహు:- మేము.

ధర్మ:- రాజద్రోహం చేసిన ఈ ఉషాసుందరినీ బౌద్ధసన్యాసినీ వధించలేదు.

వజ్ర:- మహాప్రభూ ! నిజమే. ఇదుగో మాకు సెందరగుప్త పెబువులోరు సాయంగా సామిభక్తికి ఉంగరాలు బహుమానంగా ఇచ్చారు.

వీర:- మహాపెబూ ! ఇదిగో యీ వుంగరాలు తీసేసికోండి— మేం అపచారం చేశాము.

వజ్ర:- మా పెబూ- ఈరు మా గురువుగోరు సంపనన్నాను— తరువాత ఆ పిల్లను సంపనన్నాము.

యువ:- వజ్రబాహూ ! వీరదాసరీ ! చంద్రగుప్త చక్రవర్తి బహూకరించిన ఉంగరాలను మేము తీసికోము. మీరు నాకు మరచి

పోశేపట్టి మహోపకారం చేశారు. ఈ ముత్యాలహారాలు తీసికోండి.

వీర:- పెట్టువారి కడుపు సల్లగుండాలి.

యువ:- ఉషాసుందరీ ! నీవులేని ఈ మగధసామ్రాజ్య కిరీటం నాకు శ్మశానంలో విరిసిన వెన్నెల, ఈనాడు నేను అదృష్టవంతుణ్ణి.

:: నందిని ప్రవేశం ::

నందిని:- యువరాజా ! నీవు అదృష్టవంతుడవే ! కాని మేమందరం అదృష్టహీనులం. మేఘవాహనుడు అదృష్టహీనుడు. ప్రజలందరు అదృష్టహీనులు. యుద్ధంలో మరణించిన సేనకు వేలు మహావీరులు అదృష్టహీనులు. వికలాంగులై కాళ్లుపోయి కన్నులుపోయి బాధపడుతున్న నిర్భాగ్యసోదరులందరు అదృష్టహీనులు.

యువ:- సోదరీ ! మేఘవాహనుని మరణం నీకు ఎంత విచారకరమో నాకు అంతకంటె విచారకరం. ఆ మహావీరుని స్మృతి చిహ్నంగా పాటలీపుత్రంలో ధ్వజస్తంభం కట్టిస్తున్నాను.

నందిని:- మహాప్రభూ ! ఈ ఘోరయుద్ధంమూలాన విలపిస్తూవున్న వికలాంగులను వియోగులను ధ్వజస్తంభాలపైనుండే విజయలక్ష్మి ఓదార్చలేదు. మహాభాగా ! బౌద్ధసన్యాసీ ! నిన్ను చేరటానికి శ్రావణమాసంలో సముద్రునిచేరటానికి పరవళ్లు త్రొక్కే నదీసుందరివలె నా హృదయం ప్రవహిస్తోంది. మీ దర్శనం కల్గటం నా అదృష్టం.

బౌద్ధ:- సోదరీ ! నీ ఆవేదన నాకు అర్థమైనది.

ఎందరో యుద్ధమందు మరణించిరి వీరులు మేఘవాహను
డందరిలో నొకండు; కనకమ్మ మహాసతులెందరీవిధిన్
నందనులన్ సహోదరుల నాథుల గోల్పడినారొ ! వేదనా
క్రందనముల్ వృథా; తిరిగిరారు గతించినవారు సోదరీ !

బుద్ధభగవానుని కరుణామృతవర్షం నీ హృదయానికి శాంతి ననుగ్రహించుగాక, ధర్మసోదరీ! పుత్రహీనలు, విగత భర్తృకలు ఎందరో మూకశోకముచే కుమిలిపోతున్నారు.

నందిని:- తండ్రీ! బౌద్ధసన్యాసినిగా మానవసేవచేసి తరించాలని నా ఆశయం. దీక్షను అనుగ్రహించి రక్షించుమప్రభూ!

బౌద్ధ:- ధర్మసోదరీ! నిన్ను బుద్ధభగవానుడు అనుగ్రహించినారు.

నందిని:- ధన్యురాలను.

యువ:- మహాభాగా! నీ దివ్యవాక్కు వేదనా వికలులకు అమృత తుల్యం. నీ మూలమున నాపాసుందరి బ్రతికినది. నీకు మరణ దండన విధించినందుకు క్షమా భిక్ష నర్థిస్తున్నాను.

బౌద్ధ:- యువరాజా! నాకు మరణం శిక్షకాదు మరణమే గనుక కలతలు కలలు కలవరింతలు లేని శాశ్వత నిద్రయైనట్లయితే ఇహలోకంలోని బాధలు మమకారాలు అంతరించిపోతాయి. అంతకంటె అవశ్యం వాంఛనీయమైనది లేదు. లేదా! మరణం వేరొకజన్మానికి మోక్షద్వారమైతే జరావికలమైన ఈ దేహాన్ని వదిలి నూతన దేహాన్ని ధరించటం ఎంత ముదావహమైన విష యం రాజనందనా! బుద్ధభగవానుని దివ్యప్రబోధచంద్రికలు మగధ సామ్రాజ్యాన్ని కరుణారస తరంగితమైన స్వర్గసీమచేయు గాక!

యువ:- మహాభాగా! నీ ప్రబోధానికి మగధ సామ్రాజ్యంలో అంతరాయాలు కల్పించను. యథేచ్ఛగా జిజ్ఞాసువులకు బుద్ధభగవానుని దివ్య సందేశం అందించు.

ఉపాదేవి!- నేను మహాపరాధంచేశాను. నిన్ను క్షమా భిక్షను అర్థించటానికిగూడ నాకు నోరు రావటంలేదు. కరు ణించి నన్నూ ఈ మగధ సామ్రాజ్యాన్నీ ఏలుకో.

ఉష:- రాజనందనా ! క్షమించటానికి నాకు ఎవ్వరూ అపకారం చెయ్యలేదు. పైగా ఉపకారంచేశారు. నాకు మహాసేనుడు మరణశిక్ష విధించకపోతే ఏమయ్యేదో తెలియదు. ఒకవేళ మగధసామ్రాజ్య మహారాజ్ఞినైనా, అంతఃపురంలో హంస తూలికా తల్పాలపై భోగలాలసత్వంలో రాక్షసివలె కాలం గడుపవలసివచ్చేది అప్పుడు మగధరాజ్యాన్ని ఏలుకునేటట్లు భావించేదాన్ని. కాని ఇప్పుడు విశ్వకరుణప్రపంచాన్ని ఏలుకుంటున్నాను.

యువ:- అంటే ఉషాసుందరీ ! నీవు నన్ను క్షమించటంలేదన్న మాట.

ఉష:- కాదు ప్రభూ ! ప్రపంచంలో దరిద్రనారాయణులు తింటానికి కూడు, కట్టటానికి గుడ్డ లేక అటమట లాడిపోతున్నారు. రాజనందనా ! అంతఃపుర సౌధమాలికలలో రత్నదీపాంకుర ప్రభారాగ పంక్తులలో హంసతూలికా తల్పాలపై క్షుధార్తుల దీనవేదనారావాలు వినిపిస్తాయా ప్రభూ !

యువ:- ఉషాదేవీ ! నీవు తొల్లిటివలె నన్ను ప్రేమించుటలేదా ?

ఉష:- రాజనందనా ! నిన్ను ప్రేమిస్తున్నాను, ప్రేమించాను. అంతేకాదు, నిన్ను ప్రేమిస్తున్నట్లే యీ విశాల విశ్వాన్ని, సమస్తజీవకోటిని ప్రేమిస్తున్నాను. కామకలుషితముకాని యీ పవిత్రప్రేమ ఆకాశముకంటె ఉన్నతమైంది. అనంతకోటి తారకాలోచిస్సులకంటె ఉజ్జ్వలమైనది. సప్తసముద్ర పరివృతమైన ఈ విశ్వముకంటె విశాలమైనది. దీనజనులను, సమస్తభూతకోటిని ప్రేమించు రాజనందనా !— అప్పుడు నిన్ను అజరామరమైన సౌందర్యం వరిస్తుంది.

యువ:- నీవు సహధర్మిణివై యుంటే ఎంతపని అయినా నీతో కలసి నిర్వహిస్తాను. నన్ను అనుగ్రహించు ఉషాదేవీ !

ఉమ:- రాజనందనా ! ఆగు ! నేను బౌద్ధసన్యాసినిని. పరివ్రాజకా శ్రమం స్వీకరించి బహుకాలమైనది.

యువ:- ఉషాసుందరీ ! ఆగు ! ఒక్కమాట !

ఉష:- బిందుసార ధర్మసోదరా ! సుందరమైన ఈ సృష్టిని నరకంగా మార్చుచున్న పాశవిక ప్రవృత్తులను సంహరించి యీ భూలోకాన్ని స్వర్గలోకం చెయ్యి. బుద్ధభగవానుని దివ్యప్రబోధ చంద్రికలు నీ కిరీటాన్ని కరుణాజ్యోత్స్నా తుషారధవళం చేయుగాక.

యువ:- ఉషాసుందరీ ! బుద్ధభగవానుని సందేశాన్ని నా కిరీటం మీద ధరిస్తాను. నీవు మగధసామ్రాజ్యంలో—

ఉష:- ధర్మసోదరా ! నాకు ఒక కోరిక ఉన్నది.

యువ:- తప్పకుండా నెరవేరుతుంది.

ఉష:- నేటి సాయంసంధ్యాకాలంలో సింహళానికి నౌకలు బయలు దేరుతున్నాయి. నన్ను ఒక నౌకలో సింహళదేశానికి పంపించు- దేశ దేశాలకు పోయి బుద్ధభగవానుని దివ్యప్రబోధంచే విశ్వ మానవప్రపంచాన్ని కరుణాజ్యోత్స్నా సుకుమార సుందర సుస్నిగ్ధం చెయ్యటమే నా తపస్సు.

యువ:- ఉషాసుందరీ! ఇంతవరకు నీవు నా మధుర స్వప్నసుందరివి. ఇప్పుడు దివ్యోపదేశంచేస్తున్న అమృత తరంగిణివి. నీ కోరిక ప్రకారం నా వసిద్ధం చేయిస్తాను నాకు బౌద్ధదీక్ష అను గ్రహించు సోదరీ !

ఉష:- ధర్మసోదరా ! నా ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమించిన నీకు ప్రథమ ప్రబోధం చేస్తూన్నాను. మగధసామ్రాజ్య కుమారచక్రవర్తీ ! ధర్మపత్నీ సమేతంగా రాజ్యచక్రాన్ని శాసిస్తూ ధర్మచక్రాన్ని శిరసావహించు—శలవు ! నేనిదే సింహళదేశానికి బయలుదేరిపోతాను. బుద్ధభగవానుడు నిన్ను అనుగ్రహించినాడు.

గం:- ఉపాసోదరీ! నాకుగూడ బౌద్ధదీక్ష అనుగ్రహించు—నా పాపాలకు నివృత్తి కల్గుతుంది.

ఉప:- గండోదరసోదరా! బౌద్ధధర్మాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించు.

చంద్ర:- ఉపాసుందరీ! నీ చరిత్ర సుందరపరిణామవిచిత్రం— కుమారచక్రవర్తీ! గంగానదీ వననికుంజాలమధ్య వికసించిన సుందరపుష్పం పాటలీపుత్ర శ్మశాన వాటికలో వాడి బౌద్ధధర్మ జగత్తులో ఫలించింది. మా యుగం గతించింది. నేనూ చాణుక్యమంత్రీ ఆశ్రమవాసులమై విశ్రమిస్తాము.

చా:- కుమారచక్రవర్తీ! కాలమహాస్రవంతి యుగయుగాంతరాలలో క్రొత్త వెల్లువలతో పొంగి ప్రవహిస్తుంది. సామ్రాజ్య నిర్మాణంలో దండనీతి అవసరం. పరిపాలనలో ధర్మదీప్తి ఉత్తమం. మేం నిర్మించాం, నీవు పరిపాలించు. కుమార చక్రవర్తీ! నీకు మా ఆశీస్సులు!

యువ:- చరితార్థుకను. ఈ బౌద్ధసన్యాసి గురుదేవుడై, కుక్కుటారామానికి అధినేతయై మగధప్రజలను రక్షించుగాక.

బౌద్ధ:- బుద్ధాయ సద్ధర్మతేజోప్రదీపాయ
తుభ్యం నమోనమః
దీనజనరక్షా దివ్యప్రబోధాయ
సర్వభూతదయాస్వరూపాయ
తుభ్యం నమోనమః

[సంపూర్ణం]